## పాత్రలు :

మనోరమ

నిరుపమ

ఇందిర

కాపుమనిషి

రంగాచార్యులు

రామమూర్తి

సుబ్బారావు

శోభనాద్రిరావు

వీరయ్య

గవరయ్య

కుర్రవాడు

నౌకరు

పోలీసులు ఇద్దరు



# మ నో ర మ

## అంకము ౧

### దేవాలయం కోనేరు గట్టు

ప్రవేశం మనోరమ నడుంపై బిందెతో తనలో తను పాడుకుంటూ. వయస్సు 20కి మించి లేదు. సన్నగా రెకరెకగా వుంటుంది. ప్రతి అవయవంలోను జీవకళ ఉట్టి పడుతూ వుంది.

బిందె గట్టుపై పెట్టి ఏదో ఆలోచిస్తూ కండ్లు మూసుకొంటుంది. అప్పుడు ప్రవేశం నిరుపమ వెనకతట్టుగా. మనోరమకు తెలియకుండగా వచ్చి తన చేతులతో కండ్లు మూస్తుంది.

మనోరమ: (తన చేతులతో నిరుపమ చేతులు స్పృశించి) ఎవరో చెప్పుకోలేనా ఈ బొద్దు వేళ్ళు, ఇంకెవరివి-నిరూ! ఓడిపోయావ్?

నిరుపమ: (చేతులు తీసేసి) పోనీలే. కానీ ఏం అలా ప్రతిమ లాగ నిలబడిపోయావు?

మనో: ప్రతిమలాగా (కొంచెం నవ్వి) అలాగే నీ వాక్కు ఫలించి అదో ఆ దేవాలయం స్తంభాల పైనుండే ప్రతిమల్లాగ అయిపోతే బాగానే ఉంటుందేమో...

పూర్వకాలంలో అల్లా జరిగేది గాబోలు. అహల్యకు శాపవిమోచనం తరువాత అయిపోబట్టిగాని లేకపోతే ఇప్పటికిన్నీ ఏ పొలంలోనో నల్లరాయిగా ఉండవలసిందేగా!

నిరు : ఆ భాగ్యానికేం. నువ్వూ అహల్యచేసిన గమ్మత్తు చేస్తే కలుగుతుందేమో!

మనో: ఛీ! ఊరుకో, ఎప్పుడూ ఆ గొడవ తప్పితే వేరే లేదా ఏమిటి... ...చెవులు కాయలు గాసిపోతూ వున్నాయి అందులో దేవాలయంలోపల, దగ్గర.

నిరు : మనూ! అదేవిటి నీతివాచక పుస్తకాల్లోలాగు మాట్లాడుతున్నావు. దేవాలయాల్లో జరిగే విషయాలు ప్రతిరోజూ చూస్తూండినన్నా.

మనో: అబ్బబ్బ! మీ గుండెలు రాళ్లైపోయినాయి.

నిరు : అవును. లేకపోతే వెన్నలాగ కరిగి నెయ్యిలాగ జారిపోతే ప్రయోజనం ఉందా ఏవిటి... అగడ్తలో పడ్డ పిల్లికి అదే వైకుంఠం.

మనో: అంతేనా! అంతేనా... మనకూ పిల్లిపిల్లలకు భేదం (వ్రేలితో సున్న చుట్టుతూ) అంతేనా?

నిరు : అంతే... ముమ్మాటికి అంతే... చూద్దాంకదూ నీ వెంతమాత్రం ఈ అగడ్త నుండి బైటపడతావో.

మనో: నిరూ! ఇది న్యాయమేనా నీకు. నన్నిలా దెప్పి పొడవడం.

నిరు : అంతేకాదు, మనూ! పోనీ, నూటికో కోటికో ఒకరు బయట పడతారనుకో. పడితేమాత్రం అది వైకుంఠం అనుకున్నావేమో... ..అప్పుడు వేరే బాధలు...తడిబట్టతో పీక కొయ్యడంలాంటిది... పెళ్ళాడినా దాసీ దాసీయే...అంతకన్నా తమాషా ఏమిటో చెప్పనా ! (మెల్లగా) మనకు ఇప్పుడుండే గౌరవం పలుకుబడీ కూడా అప్పుడుండదు. అదీ ప్రపంచంలో ఉండే కిటుకు.

మనో: మాట్లాడు—అలాగే మాట్లాడు. ఏమో ! కొంతకాలానికి నా అభిప్రాయాలు కూడా మారిపోతవేమో... అప్పుడు మీరు నన్ను చూచి నవ్వరూ...ఎందుకూ ఆ పరాభవం. ఇక మీతో ఎవ్వరితోనూ నా భావాలు చెప్పుకోను. నాలోనే తొక్కి దుమ్ము చేసేసుకొంటాను. మీదగ్గిర లోకజ్ఞానం నేర్చుకుంటాను.

నిరు : మనూ ! నిన్ను చూస్తే నాకు జాలేస్తూందిసుమా ! ఎలా బతుకుతావో.

మనో: (మౌనంగా వుంటుంది.)

ప్రవేశం ఇందిర – దాసీ. మనోరమా నిరుపమల్ని చూచినీ్న చూడనట్టు నటించి వెళ్ళుతోంది.

నిరు : ఇందిరా, ఏం కనపడ్డంలేదా ?

ఇందిర: కనబడకేం. అదృష్టం లేకపోయినా దృష్టి బాగానే వుంది.

నిరు : మాతో మాట్లాడగూడదా ?

ఇందిర: అయ్యో! ఎంతమాట అన్నావు ! నాబోటివాళ్లతో మీబోటివాళ్ళు మాట్లాడతారా అని నేను సంకోచిస్తోంటే !

నిరు : అదేవిటీ? నాకూ నీకూ అంత భేదం వుందా, ఎప్పుడు కనుక్కున్నావ్ ?

ఇందిర: నేను 'నీ' అన్నానా ? మీ అన్నానా ?

మనో: చురుగ్గా అంటే !—

ఇంది : అమ్మయ్యో ! దేవిగారు ఇప్పటికి మాట్లాడారు.

మనో: ఇందిరా ! ఏం విపరీతంగా మాట్లాడేసేస్తున్నావు. నేనేం నీజోలి కొచ్చానా, నిన్నేమైనా అన్నానా, ఎందుకలా నన్ను సాధిస్తున్నావు ? నా బతుకు పువ్వు బంతిలాగ ఉందా ఏమిటి, అలా ఆడుతున్నావు.

ఇంది : వహావా ! ఏం చమత్కారంగా చెప్పావు. తెలుస్తూనే వుంది... రాశాడు బ్రహ్మ మొహాన్న అదృష్ట రేఖ.

మనో: నా మొహాన్నా !—అదృష్ట రేఖా !—పోనీ ! దాని ఫలితం నేను అనుభవించక పోయినా నువ్వైనా చూచి సంతోషిస్తున్నావు.

ఇంది : ఎన్ని నేర్చావే... అందుకే ఆయన్ని అలా వేసేసుకున్నావు నీ వలలో...కదూ ! (చిరునవ్వు)

మనో: (కోపంతో) చూడు, అలా అర్థోక్తిగా పలకడానికి అవసరం లేదు. ధైర్యం వుంటే మనసులో వున్నదంతా కక్కేసెయ్.

ఇంది : అబ్బో! చాలాదూరం వచ్చిందే. నన్నా కక్క మంటావ్? కక్కడాని కేముంది? లోకానికంతా తెలిసిందేగా. నీ మాయల్లో పడ్డతర్వాత మేమంద రమూ మాలకాకుల మైపోయాము. నీదే రాజ్యం. నీదే భాగ్యం. అనుభవం అంతా నీదే. ఆచార్యుల వారి భజనంతా నీకాలి గజ్జల భజనేనా — వారి వేదాంత విచారణంతా నీ సౌఖ్యం, నీ సంతోషం విచారించుకోవడమేనా! వారి భక్తిపారవశ్యమంతా నీ కౌగిలింతలతోనేనా!

మనో: (కన్నుల నిప్పులొలుకుతూ ఉన్నాయి. హఠాత్తుగా ఇందిర కంఠం చేతులతో పట్టుకొని బిగించి వేస్తుంది. ఇందిర ఉక్కిరిబిక్కిరై, గిజగిజ కొట్టుకుంటుంది.)

నిరు : అయ్యో! అయ్యో! ఇదేవిటీ ఆగడం. (ఇద్దర్నీ విడదీస్తుంది) మనూ! ఎంతపని చెయ్యబోయావ్... ఇందిరా! తప్పంతా నీదే...

మనో : (పళ్లు బిగపట్టుకు వూరుకుంటుంది)

ఇంది : (తెప్పరిల్లి) గయ్యాళిముండ, వెనకబలం చూసుకుని మిడిసిపడుతోంది. (నిమ్మ్రిమిస్తుంది)

మనో : (చేతులులో ముఖం కప్పెట్టుకుని ఏడుస్తుంది.)

నిరు : (సమీపించి) మనూ, మనూ! ఎందుకింత బాధ పడతావ్. పరిస్థితులకు అనుగుణంగా సర్దుకొని వెళ్లాలి గాని, తిరగబడితే ఆగ్గలమా ?

మనో: (తొందరగా) ఆక్కపోతే అడుగంటిపోతాను. నిరూ! నువ్వు లేకపోయావా అప్పుడే దాన్ని చంపేసి నేనో కొలన్లో ఉరికేదాన్ని.

నిరు : అంతవరకేనా నీ పట్టుదల, నీ భావాలు.

మనో: భావాలు బండలు లోపల కుమిలి కుమిలి కుళ్ళి పోతూవుండటం చాలక నలుగుర్లో నానా మాటలూ విని ఇంకా ఎలా ఓర్చుకోవటం... ఆచార్యులట ! పింజారి వెధవ... ...బుద్ధిలేని జంతువులకన్నా అధ ముడు ... ... దిక్కులేందాన్నని, అసహాయనని, అన్యాయంచేసి నా మానాన్ని దొంగిలించి ద్రోహం చేసిన తుచ్ఛుడు. పీడిమూలాన ప్రతిదినం ఒక యుగంలాగ గడుపుతూవుంటే ఈ భాగ్యానికి ఈర్ష్య... అసూయ... విరోధం... అనరాని మాటలు పడరాని బాములు......నిరూ ! ఏవిటలా పరధ్యా నంగా ఉన్నావ్ ?

నిరు : ఆఁ...

మనో: అవును. వారివారి స్వంతబాధలు వారికే—క్షమించు. ఒళ్లు తెలియకుండా మాట్లాడేశాను.

నిరు : (చేతులు కట్టుకొని) అబ్బ! ఎంత త్వరగా తప్పు పడతావు! మనస్సులోకి వచ్చిన భావానికి భయం వేసి చెప్పడం మానేశాను. కాని, ఇప్పుడు చెప్పక తప్పదు. చెప్పకపోతే నువ్వు అపార్థంచేసుకొంటావు.

మనో: అపార్థంలేదు, అనర్థంలేదు చెప్పు.

నిరు : మనూ! ఎప్పుడైనా నువ్వు ఆచార్యులవారిని చంపేస్తావేమో అని భయం వేసింది.

మనో: (పెదవి కరుచుకొని) పొద్దెక్కినట్టుంది. రా వెళ్ళి పోదాం.

నిరు : మనూ! అలాంటిపని చెయ్యనని ఒట్టేయి.

మనో: (నవ్వి) ఒట్టేస్తేమాత్రం. అలా రాసుంటే జరక్కుండా మానుతుందా ఏమిటి?

నిరు : (చెయ్యి పట్టుకొని) మనూ! నవ్వకు. నువ్వు ఒకొక్కప్పుడు నవ్వితే నాగుండె కొట్టుకుంటుంది.

మనో: పోనీలే...ఏడుస్తా.

(ప్రవేశం రంగాచార్యులు.)

రంగా: (కొంచెం తూలుతూ పదానికీపదానికీ మాటమాటకీ లంగరేశి మాట్లాడుతుంటాడు.) ఏమీా? ఏమీా! ఎవరూ ఏడవటం... నా మనూనా! నా బంగారా— అయ్యయ్యయ్యో!

మనో: నేనేం ఏడవడం లేదులెండి. తమరు ఓదార్చడానికి. నిరూ? రావే. (వెళ్ళబోతుంది)

రంగా: ఆఁ. ఆఁ. ఏవిటీ అవసరం. రాచకార్యాలు మునిగి పోతున్నాయా రాణిగారికి... ...

మనో: అదుగో అలాఅనకండి. మీకు నమస్కారం. ఇక్కడ రాణీగారు లేరు. గీణీగారులేరు. ఉన్నవారిద్దరూ దాసీముండలే ?

నిరు : మనూ ?

మనో: ఏం ఏంవొచ్చింది మనూకు. ఉన్నదున్నట్టు చెపితే మోటుగా వుంటుందిగదూ.

రంగా: అమ్మయ్యో ! నా బంగారానికి నామీద కోపం వచ్చిందింకెట్లా ? అందులో ఇప్పుడెంత సంతోష వార్త చెప్పడానికి వచ్చాను.

మనో: ఏమిటా సంతోషవార్త. చేసిన పాపాలు పోవడానికి ఎవడైనా షాహుకారు బంగారు కవచం సమర్పిస్తా నన్నాడా ?

రంగా' మా మనూ ఇవ్వాళ ఉగ్రమూర్తిగా వుందేమో.

మనో: నేను మీ మనూనుగాను, ఎవరి మనూనుగాను.

రంగా: పోనీగాని, చూడు ! పెద్దమనుషులు వస్తారు ? చాలా గొప్పవారు. ఈ దేవాలయం ప్రధాన ట్రస్టీగారి కుమారుడూ, ఆయన స్నేహితుడూ, ఇంగ్లండునుంచి వచ్చారు. ఇటీవలే మన దేవాలయం చూడాలని సర్దాపడ్డారు.

నిరు : ఆశ్చర్యం !

మనో: ఏమీా ! ఇంగ్లాండుకు వెళ్ళివస్తే దేవాలయాలకు రాకూడదా ?

రంగా: అచ్ఛా ! బాగా చెప్పావు ! వారు వస్తారట ... ఇప్పుడే... దేవాలయమంతా బాగా చూపించటానికి తోడుగా మనూనే నియమమిస్తామని ఎంతో ఆశతో వచ్చాను.

మనో: ఎందుకూ మను? ఆమాత్రం మీారుచూపించలేరా... వీలుంటే భక్తిమార్గంకూడా ఉపదేశిస్తారేమో !

రంగా: రువ్వేస్తున్నావు మాటలు...మనూ ! నేను చూపిస్తే ఏముంటుంది స్వారస్యం. ముసలివాణ్ణి, ఆచార్యుణ్ణి...

మనో: ఓహో ! అయితే మీారు వచ్చేవారికి చూపదలుచుకున్నది దేవాలయాన్నా; మమ్మల్నా ... ?

రంగా: దేవాలయాన్నే అనుకో. ఐనా, వాళ్ళు, నవనాగరికులు, పడుచువాళ్ళు. నాకూ వారికీ సరిపోతుందా. అన్నాడు గదూ భారతలోం...

(కూనిరాగం తీస్తూ)

నెయ్యమునకు, కయ్యమునకు
వియ్యయమునకు సమతవలయూ _ అని.

మనో : బాగావుంది ఆచార్యులవారి విపరీత వ్యాఖ్యానం.

రంగా : ఆమాత్రం నాకు సహాయం చేస్తావుకదూ! నా పేరు నిలబెడతావనే నమ్మకం చేతనే నిన్నడుగో్తున్నాడం. ఏం మనూ ! ఊ కొట్టవూ?

మనో : ఊ___

రంగా: దీర్ఘాయుష్మాన్ భవ!

మనో: (నవ్వుతూ) ఉపయోగంగా వున్నాననేనా అలా ఆశీర్వదించారు? ఈ యవ్వనం కాస్తా వెళ్ళిపోతే 'శీఘ్రమే స్మశాన ప్రాప్తిరస్తు' అని శపించరూ!

రంగా: నీతో నేడు నోరివ్వడం సబబుగా లేదు... ...అసలు వొప్పుకున్నదే నా భాగ్యం... (వెళ్ళుతూ) మనూ! నువ్వు గనక ఒక్క సమ్మోహనాస్త్రం వేశావా; కుక్కైపోతాడు - నీ శక్తి నీకు మాత్రం తెలియదూ?

మనో: చాల్చాలు - పరువుగా వెళ్ళిపొండి.

నిరు: (రంగాచార్యులు వెళ్ళిపొయ్యాక) మనూ! నీ చర్యం తా చిత్రంగా వుంది-ఎలా వొప్పుకున్నావ్?

మనో: ఏం వొప్పుకున్నాను - కొంప దీయడాని కొప్పుకున్నానా? కూనీచెయ్యడాని కొప్పుకున్నానా? ఎవరో పెద్దమనుషు లొస్తే మర్యాద చెయ్యడం మనం ప్రతిరోజూ చేసే అనాచారాలకి తీసిపోయిందా?

నిరు: కాదు... కాదు... కానీ, ఆచార్యులు ఆఖరున అన్న మాటలు విన్నావా?

మనో: విన్నాను... ఏమో! ఎవరు చెప్పగలరు? అప్పటికి నా బుద్ధి ఎలా మారుతుందో, నిజంగా నా మనస్సుకు నచ్చినవాడు కనబడితే నేనేం చేస్తానో.

నిరు: ఇక నీతో ఎవరు మాట్లాడగలరు?

మనో: (నవ్వుతూ) పిచ్చి నిరూ! నిన్ను చూస్తే జాలేస్తూ వుంది. ఎలా జీవిస్తావో. (కారు హారన్ శబ్దం విం

టుంది) వారే అనుకుంటాను...(పైట సర్దుకొని)నిరూ!
చూడు! కన్నీళ్ళ మరకలేమైనా వున్నాయేమో...
ఇదే గుండె కొట్టుకొంటూ వుంది!

నిరు : భయపడకు.

మనో : ఆఁ! భయమా. ఎందుకూ? భయపడవలసిన పని నే
నింతవరకూ ఏమీ చెయ్యలేదు.

ప్రవేశం : రామమూర్తి, సుబ్బారావు.

(ఇద్దరూ నమస్కరిస్తారు.)

మనో : (నమస్కరిస్తుంది, కొంచెంగా తల వంచుకొని.)

నిరు : (నమస్కరించక) అయ్యో, తమలాటి వాళ్ళు మాకా
నమస్కరించడం ?

మనో : (కొంత మెల్లగా, అయినా అందరికీ వినబడేటట్టే) ఛీ!
ఊరుకో, అదీ ఒక సాంప్రదాయం. నిన్ను సత్కరించ
డం కాదు.

రామ : (నవ్వుతూ) అంతే లెండి.

మనో : తమరు వస్తారని మా ఆచార్యులవారు చెప్పారు.
మీకు సర్వ సపర్యలూ చెయ్యడం మాకు విధి.

రామ : చాలా థాంక్స్... ముఖ్యంగా మా ఫ్రెండ్ కోసరమే
వచ్చాను. అతనికి దేవాలయాలంటే చాలా ఇంట
రెస్టు. అంటే ఆసక్తి...మీరు క్షమించాలె ..ఇంగ్లీషు
పదాలు ఉపయోగించడం మానేయడానికి ప్రయత్ని
స్తాను గానీ అప్పుడప్పుడు దొర్లక మానవు.

మనో : అసలు తెలుగే మరచిపోకుండా వుండడమే ఎంతో గొప్ప సంగతి గాదా!

సుబ్బా : బాగా మాట్లాడేశారోయి నిన్న.

రామ : ఈ మధ్య ఈ విధంగానే మాట్లాడ్డం అలవాటు చేసుకున్నారు లెండి ... ఇక్కడున్నంత కాలం దేవాలయాల్ని చూచి నవ్వేవాడు, విసుక్కునేవాడు. ఇంగ్లాండులో కొందరు పుస్తకాల్లో ముఖతా పొగడ్డం చూచి మారిపోయాడు. ఇప్పుడొకటే వెర్రి... ఈజిట్ నాట్ ?

సుబ్బా : నువ్వెప్పుడూ గాడ్‌లెస్ ఫెలోవే. మావాడు శుద్ధ నాస్తికుడు లెండి.

మనో : నిజంగా ?... నాకు నాస్తికులంటే అభిమానం. వారి మనస్సు మంచిదిగా వుంటుంది. (చటుక్కున పెదవి గరుచుకొంటుంది.)

రామ : సుబ్బారావు ! మంచి హిట్టోయి!... తమ రెందుకలా అన్నారు ?

మనో : క్షమించండి. ఏదో అజ్ఞానంచేత అవసరంగా అనేశాను.

రామ : మిమ్మల్ని క్షమించడ మెందుకు? థాంక్ చెయ్యాలి. కారణం లేకుండా అన్నారని నమ్మను. చెప్పండి.

మనో : ఆస్తికులకు ఎంతచెడ్డ మనస్సున్నా ఎన్ని చెడ్డ కార్యాలుచేసినా భగవంతుడు మోక్షమిస్తాడనే నమ్మకమూ, ధైర్యమూ వుంటుంది. నాస్తికుల కాధైర్యం లేదుగనుక వారు తమ మంచిహృదయమూ, సత్తా

ర్యాలూ—వీటిచేతనే తమ జీవితాన్ని సార్థకం చేసుకో వడానికి ప్రయత్నిస్తారు.

రామ : (మాట్లాడక ఊరకుండును.)

సుబ్బా: చాలా కఠినంగా వుందిగదూ మార్గం.

రామ: నే ననుసరిస్తానన్నానా ఏమిటి ?

మనో : అయ్యో ! అనుసరించరూ!

రామ: (తబ్బిబ్బు పడి) మేమొకరొక్కరం పరిహాసం చేసుకుంటూ వుంటామలెండి. అప్పుడు మా మాటలకు అర్థమూ తాత్పర్యమూ వుండదు.

మనో : అంతే గద !

నిరు : అదేమిటే, అలా మాట్లాడుతున్నావు. పెద్దమనుషు లేమనుకొంటారు.

మనో : క్షమిస్తారుగదా. చాలా చొరవగా మాట్లాడుతున్నానేమో, నాకు బొత్తిగా లోకజ్ఞానం లేదని మా సఖి చెప్తూనే వుంటుంది.

రామ: ఇందులో క్షమించడానికేముంది...మీకే మేమెంతో శ్రమ ఇస్తూవున్నాము. ఆచార్యులవారినీ మిమ్మల్నీ ఎంతో థాంక్ చెయ్యాలి. మీకు అచార్యులవారు...

మనో : (నవ్వుతూ) మాకు ఆచార్యులవారు ఆచార్యుల వారే. మాకు శ్రమేమిటి! మా ధర్మాల్లో ఇదొకటి.

రామ: అనగా ?

నిరు : మేమీ దేవాలయానికి చేరిన దాసీలమండి.

రామ: నిజంగా! (సుబ్బారావుతో మెల్లగా) సుబ్బారావ్! డ్రెస్సూ, వైఖరీ అవీ ఎలా మారిపోయాయి. ఇప్పటి దేవుళ్ళకు కొత్తఫేషన్లపైనే ప్రీతి ఎక్కువ.

నిరు : ఛీ! అలా వక్రంగా మాట్లాడకు!

మనో : వక్రమేమిటి. అంతా సక్రమంగానే వుంది. వారింకా మనం ఆచార్యులవారికి కూతుళ్ళమో కోడండ్లమో అని పొరబడుతుంటే, మరి ఎవరంగా చెప్పొద్దా!

నిరు : రామ రామ!

రామ: క్షమించండి. మీరు వినాలనే ఉద్దేశంతో చెప్ప లే దామాటలు.

మనో : దానికేం లెండి ... నాటకంలో నటులు తమలో మాట్లాడుకునే మాటలు స్టేజిమీదవారికే గాక గాలరీ వరకు వినబడవూ!

రామ: మంచి హ్యూమర్ ఉందండి మీకు

మనో : అంటే?

రామ: (తలగోక్కుంటూ) సరిగ్గా తెలుగుపదం చెప్పలేనండీ. చమత్కారంగా మాట్లాడ్డం. యుక్తి,హాస్యరసమంటే సరిపోదేమో!—సుబ్బారావు!

సుబ్బా: తరువాత చూద్దాం!—ఆలస్యమవుతోంది.

రామా: సారీ, చాలా డిలే చేశాను (నిరుపమను చూచి)మా సుబ్బారావును తీసికెళ్ళి దేవాలయమంతా చూపండి ... వెళ్ళిరాండి! నే నిక్కడే బాతాకానీ కొట్టూ వుంటాను.

సుబ్బా: బతేవాడివోయి... ...సరే ... చెప్పులు తీసేయా లేన్నెమో !

మనో : ఇప్పుడే అవసరం లేదులెండి... కావలసినప్పుడు మా నిరుపమ చెప్తుంది. దానికి ఆచార వ్యవహారాలు అన్నీ తెలుసును.

నిరు : ఊరుకో !...

సుబ్బా: వెళ్ళవచ్చునా ?

నిరు : చిత్తము...(నిరుపమ, సుబ్బారావు నిష్క్రమిస్తారు.)

మనో : (రామమూర్తిని ముఖాముఖి చూడక ఇటూ అటూ చూస్తూ నిలబడుతుంది.)

రామ: మీ సఖిపేరు చెప్పారుగాని, మీ పేరు చెప్పారు గారు.

మనో : నా పేరా ? మనోరమ.

రామ: అనగా - మనస్సును రంజింపచేసేది అనేకదూ అర్థం.

మనో : పేర్లన్నీ సార్థకంగా వుంటాయా ఈ లోకంలో...

రామ: ఉండవని నాకు తెలుసును. అందుచేతనే అలా ఉన్నప్పుడు మరీ వాల్యూ ఉంటుంది. అనగా విలువ వుంటుంది.

మనో : (నవ్వుతూ) గొప్పవారు వేళాకోళం చెయ్యడంకూడా మమ్మల్ని అనుగ్రహించడమే అనుకొంటాను.

రామ: ఎంత చమత్కారంగా మాట్లాడతారు! కాని నే చెప్పింది వేళాకోళం మాత్రం కాదు.

మనో : (సిగ్గుతో తలవంచుకొంటుంది.)

రామ: ఎన్నాళ్ళబట్టి ఈ......

మనో : ఈ దాసీత్వమా. కొన్నాళ్ళే లెండి.

రామ: మీ తల్లికూడా ...

మనో : నాకు తల్లిగాని తోబుట్టుగానీ, ఎవరూ లేరండీ ... ఏకాకిని...

రామ : క్షమించండి. అడిగి బాధించాను.

మనో : అయ్యో ! అంతమాత్రం అడిగేవారు కూడా లేరండీ నాకు. అడగండి చెప్తాను.

రామ : ఏమీ అనుకోరుగద!

మనో : ఒకవేళ అనుకున్నా నిష్ప్రయోజనం గనక నేనే నెప్పుడూ ఏమీ అనుకోను.

రామ : మీకీ వృత్తి ఇష్టమేనా ?

మనో : అంటే ?

రామ : అంటే, స్వతంత్రంగా అవలంబించారా అని.

మనో : ఏమి ప్రశ్న అడిగారండి ! స్వతంత్రంగా ఎవ్వరూ ఏ వృత్తీ అవలంబించరనుకుంటాను. అందులో యీ వృత్తా ?

రామ : అయితే బలవంతమా ?

మనో : వేరేగతి లేనప్పుడు బలవంతమూ స్వతంత్రమూ ఒక్కటే అవుతుందేమో !

రామ : నిజమే. అర్థమైంది... కాని నే నడగదలచుకొన్న ప్రశ్న అడగలేదు.

మనో : ఏమిటా ప్రశ్న.

రామ : మీారీ జీవనంతో తృప్తిపడ్డారా ?... ఇది మీా మన సుకు నచ్చిందా? మీారు యదార్థంగా సంతోషంతో కాలం గడుపుతూ వున్నారా ? అబ్బా! ఎన్ని ప్రశ్న లడిగేశాను.

మనో : (ఊరుకుంటుంది)

రామ : అయ్యో, కోపం వచ్చిందా ? విషమ ప్రశ్నలు వేశానా? అధిక ప్రసంగం చేశానా ?

మనో : ( ఇక ప్రవాహం ఆగదు ) అబ్బ ! ఎందుకలా మాట్లాడుతారు? ఎందుకలా ప్రశ్నిస్తారు ?... ...నా వొళ్ళు భగ్గుమని దహించుకుపోతూంది...నా గుండె చిల్లులు పడిపోతోంది. నన్ను చూడండి, సంతో షంగా కాలం గడుపుతూ వున్నట్టే వుందా ? ఈ జీవ నం నాకు నచ్చినట్టే కనబడుతోందా ?... లేదు... మీాకు తెలుసును... లేకపోతే మొహం ఎందుకలా తిప్పేశారు ...నా పైన కనికరం వేస్తోందా...నాకు దారి చూపించడానికి ఇష్టం కలుగుతోందా ... ... అబ్బబ్బ! ఊరుకోకండి, మాట్లాడండి ... అబ్బా! ...

రామ : అయితే ఇక్కణ్ణుంచి వచ్చేస్తావా ?

మనో : (కండ్లు మూసుకుంటుంది.)

రామ : నిజంగా చెప్పు?

మనో : అబ్బ !... ఆ ప్రశ్న అడిగి ఇంకా జవాబు కోసరం ఎదురుచూస్తున్నారా ? అయ్యయ్యో ! పోనీలేండి.

(కాళ్ళపై బడి) ఇదో నమస్కరిస్తున్నాను... ...శర ణన్నాను... సరేనా! ..పాలముంచినా, నీటముంచినా మీదే అన్నాను. సరేనా!... నన్ను తీసికెళ్ళిపొండి... ఇప్పుడే... ఎక్కడికైనా తీసికెళ్ళి గోదావరిలో తోసెయ్యండి. లేదా, మీ యింట్లో నౌఖరు దాన్నిగా వుంచుకోండి. ఏమైనా చెయ్యండి.

రామ : లేవండి...అలాగే చేస్తాను. ఇక్కణ్ణుంచి తీసికెళ్ళి పోతాను.

మనో : (నిలబడుతోంది. కళ్ళల్లోంచి నీళ్ళు ధారలుగా చెక్కిళ్ళమీద పడుతోంది.)

రామ : (చూచి) ఎవరో వస్తున్నారు.

మనో : (కళ్ళనీళ్లు తుడుచుకొంటూ) వారే మా ఆచార్యులు.

రామ : వారి నడగాలి గాబోలు.

మనో : వారితో నా కవసరం లేదు. కావలిస్తే అడగండి.

ప్రవేశం : ఆచార్యులు

ఆచా : (ఇకిలించుతు) ఎంత భాగ్యం, ఎంత భాగ్యం... గొప్ప వారు రావడంచేత పావనమైంది మా దేవాలయం.

రామ : ఆఁ. ఆఁ. ఎంత మాటన్నారండి. దేవాలయం మేము రావడం చేతనా పావనమైంది ! ... అందులో మీ రలా అనడం భావ్యమేనా ?

ఆచా : ఎంత మర్యాద, ఎంత భక్తి...అదీ, గొప్ప సంప్ర దాయం అంటే అదీ. మీ తండ్రిగారిలాంటి వారు

ట్రస్టీలుగా వుండడం, నిజంగా మా భాగ్యంగాదూ...
తండ్రిగారితో సమానులు మీరు.

రామ : ఆచార్యులవారు పొరబడుతూ వున్నారు. ట్రస్టీగారి కుమారుడు దేవాలయం లోపలి కెళ్ళాడు. ఆయన స్నేహితుణ్ణి నేను. మాట్లాడుతూ ఇక్కడే వుండి పోయాను.

ఆచా : ఆలాగా, క్షమించండి. మీరేనా వారితో ఇంగ్లాండు కూడా వెళ్ళింది?

రామ : అవును... ఆచార్యులవారూ, ఒక్కమాట. ఒక్క విషయానికి మీ అంగీకారం వేడుకొంటున్నాను.

ఆచా : మీరు వేడుకోడం కూడానా? అంతమాత్రం నేను చెయ్యగలిగిందీ ఒక భాగ్యమే.

రామ : ఏమీ లేదు... ఇదిగో, మీ మనోరమను... మా వెంట పంపించడానికి కొంచెం సమ్మతిస్తారా? ఎక్కడైనా చదువుకుంటుంది. ఏర్పాటు చేస్తాను.

ఆచా : మనోరమ కిష్టమేనా?

రామ : ఇష్టమే. లేకుంటే నే నడుగుతానా!

ఆచా : మా మనోరమను దేవాలయాని కొక భూషణంగా భావిస్తాము. కదూ మనూ?... అయినా మీ రడిగి నప్పుడు 'లేదు' అని ఎలా అనగలను?

రామ : భగవంతుని ఆలయానికి భూషణాలు వేరే కావాల్నండీ?

ఆచా : అబ్బే ! ఎంత జ్ఞానం గలవారండీ తమరు ... మీారు కోరినట్లే చెయ్యండి.

రామ : చాలా థాంక్సు. వందనాలు.

మనో : (ఉత్తినే తల వంచుకొని వుంటుంది.)

ప్రవేశం: నిరుపమా, సుబ్బారావు.

నిరు : అదుగో మా ఆచార్యుల వారున్నారు.

సుబ్బా : (నమస్కరించును)

ఆచా : భాగ్యం, భాగ్యం. తండ్రిగారు కుశలంగా వున్నారు గదూ.

సుబ్బా : ఉన్నారు...ఎంత గొప్ప దేవాలయమండీ... పాపం వీరు చాలా ప్రయాసపడ్డారు.

నిరు : అయ్యో, లేదండి...

సుబ్బా : చాలా వందనాలు.

ఆచా : తమ తండ్రిగారికి మా కృతజ్ఞత ఎలా చూపడం ?

రాము : సుబ్బారావు ! మనోరమను మన వెంట రేపు తీసి కెళ్ళడానికి ఆచార్యులవార్ని అడిగానోయి. సమ్మ తించారు కూడాను.

సుబ్బా : ఏమిటి ?

రాము : తరువాత చెప్తాను. చాల పొద్దెక్కింది-వెళ్తాము.

నిరు : (మనూ దగ్గరకు వెళ్ళి) మనూ! నిజంగానా... ఏమిటి నాతో వక్కమాటైనా చెప్పావుగావు.

మనో : (పలకదు)

సుబ్బా : రామూ !

రామ : చెప్తా గదూ...

సుబ్బా : ఆచార్యులవారూ ! సెలవు...

ఆచా : అయ్యయ్యో! తాంబూలమైనా తీసుకోకుండా నే! రా నిరూ, వెళ్ళి తెద్దాం రా.

నిష్క్రమిస్తాడు - నిరుపమతో

రామ : సుబ్బారావు ! కారు స్టార్టు చెయ్యి వస్తాను.

సుబ్బా : (నిష్క్రమిస్తాడు)

రామ : (మెల్లగా) మనూ ! వచ్చేస్తావుగదూ రేపు ?

మనో : (తల వంచుకున్నది తల ఎత్తి, ఒక్కమారు చూచి, తల ఊపుతుంది.)

రామ : (నిష్క్రమించును)

పునఃప్రవేశము: నిరు, ఆచార్యులు.
నిరుపమ పళ్లెము చేతపట్టుకుంది.

ఆచా: ఓహో ! కారుదగ్గర కెళ్ళారు... మనూ ఇచ్చిరా.

మనో: పళ్లెము పుచ్చుకొని వెళ్ళుతోంది.

ఆచా: (వికటంగా నవ్వుతూ) నిరూ ? పువ్వులు పుటికిలో పడ్డాయి ఏం...

మనో : (తటాలున పళ్ళెం పడేస్తుంది గళ్ళుమని... మళ్ళీ వక్కలాకులు ఏరుతూ వుంటే తెర మెల్లిగా జారుతుంది)

# అంకము ౨

## రంగము ౧

అనాథ శరణాలయము. దానికి ప్రక్క చిన్నగది. ఒకబల్ల, నాలు గయిదు కుర్చీలు. గడపమీదుగా విజిటర్స్ అని వ్రాసిన అట్టచూస్తే ఉద్దేశం బోధపడుతుంది. ఆలయంలో ఉన్న వారిని చూడడానికి వచ్చిన వారు కూర్చోడానికి ఏర్పడ్డ గది అని.

ఒక కుర్చీమీద రామమూర్తి కూర్చున్నాడు. మనోరమ బల్ల కా ఢట్టుగా నిలబడి ఉంది.

రామ: మనూ ? కూర్చో.

మనో : (కూర్చుంటుంది.)

రామ: బాగున్నావా ?

మనో : (అంగీకారంగా తల ఊపుతుంది.)

రామ: భోజనం అదీ సరిగా ఉన్నాయా ?

మనో : (నవ్వి, తక్షణమే ఆపేస్తుంది.)

రామ: నవ్వెందుకు ?

మనో : అబ్బే ! అది నవ్వు కాదులెండి... భోజనమే లేని రోజులుకూడా నాకు అనుభవమే అని మీకు తెలి యదు.

రామ: ఆ రోజులు వెళ్ళిపోయినవి. పోనీ శ్రద్ధతో చదువు కుంటావుగదూ — తెలుగూ లెక్కలు... ఇంగ్లీషు అప్పుడే వద్దు—

మనో : (సరే అన్నట్టు తల ఆడిస్తుంది.)

రామ: ఏమిటి, అలా ఉన్నావు. బెంగతో వుంటావేమో, కొత్తచోటు అని నేనువస్తే అంత నిర్జీవంగా ఉన్నావెందుకు ?

మనో : (దుఃఖం ఆపుకోలేక, చేతుల్తో కండ్లు కప్పివేసుకుని ఏడుస్తుంది.)

రామ: అయ్యయ్యో ! ఎందుకు మనూ ?

మనో : అబ్బ ! ఇక్కడికి మీరు రాకండి... వేడుకొంటాను.

రామ: (ఖిన్నుడైపోయి) నిజంగా ! ఎంత పొరబడ్డాను. నేను వస్తే నీకు సంతోషంగా ఉంటుందనే భ్రాంతితో వచ్చాను... క్షమించు.

మనో : రామరామ ! ఏమి పెడర్థం తీశారండి. నాకోసరం గాదు. మీ కోసరమే నేను వేడుకొన్నది.

రామ: అంటే ?

మనో : చెప్పితే బాధపడతారు; చెప్పకపోతే విపరీతంగా భావిస్తున్నారు. ఏం చెయ్యను?

రామ: ఫరవాలేదు, చెప్పు.

మనో : నన్ను ఎన్నిఅన్నా నేను పడగలను. నేను పుట్టిన లగ్నబలం అది... కానీ మిమ్మల్ని ఏమాత్రం అగౌరవంగా మాట్లాడినా, నేను సహించలేను... ఇక్కడి వాళ్ళు అందరూ అనాథలే... ...అధికారులందరూ త్యాగమూర్తులే — అయినా ఇంకొకరు సుఖిస్తే ఓర్వలేరు గాబోలు... మీరు నామీద ఇంత కనికరించడం ఎవ్వరికీ ఇష్టంలేదు. ఎప్పుడూ పుల్లవిరుపు

మాటలు, చెప్పిపోడవడమే. మీ పేరు బాగా తెలిసి కూడా మిమ్మల్ని 'మనోరమను ఉంచుకున్నాయన' అని అంటారు... ముఖాముఖి నాతో 'నిన్నుంచు కున్నాయన ఏదో లెక్చరు ఇచ్చాడే. పేపర్లో పడ్డది' అంటారు. మరీ గిట్టనివాళ్ళు నేను వింటూవుంటేనే 'దీని భోగం ఎన్నాళ్ళు, దీన్ని మించిందాన్ని చూసే వరకు' అని... ఈ విధంగా అసహ్యంగా మాట్లాడు కుంటారు ... మీ పేరు ఇటువంటి పోరంబోకుల నోళ్ళల్లో పాడుగావడం నే నోర్చుకోలేనండి... అందుకే వేడుకొంటున్నాను. ఇక్కడికి రాకండి—

రామ : (పలకడు)

మనో : నన్ను మళ్ళీ ఆ దేవాలయానికే పంపించెయ్యండి... ఇంత హీనంగా చూడ రక్కడ.

రామ : తప్పంతా నాదే మనూ. వాళ్ళనని లాభంలేదు.

మనో : మీ కెందుకీ బాధ? నామూలాన్ని మీ కిదాలాభం! నన్ను ఇంత దయతో, ఇంత ప్రే... (సంకోచిస్తుంది)

రామ : సందేహనూ... ఇంత ప్రేమతో...

మనో : (సిగ్గుచేత మాట్లాడదు)

రామ : వాళ్ళు నాకు నిజంగా మంచిదారి చూపారు... అదే కర్తవ్యం. నేను తక్షణమే వివాహం చేసుకొంటాను.

మనో : (తెల్లబోయి చూస్తూ ఉంటుంది)

రామ : దినమూ, వారమూ, ముహూర్తము జరుగురా?

మనో : (పలకదు)

రామ : చెప్పవూ ?

మనో : నన్నా ?

రామ : (నవ్వుతూ) పిచ్చీ ! కాదు. నా హృదయం దోంగిలించిన శ్రీ మనోరమా దేవివి.

మనో : (కండ్లు మూసుకొని రామమూర్తి చెయ్యి తనచేతితో గట్టిగా పట్టుకొంటుంది)

రామ : మనూ ! ఏమిటది ?

మనో : (కండ్లు తెరుస్తూ) మంచిమాట వింటే నాకేమో భయం వేస్తుందండీ... నిజమో కాదో అని.

రామ : పిచ్చిపిల్ల ! (అని చేరదీస్తాడు.)

మనో : ఎవరన్నా చూస్తారండీ.

రామ : చూస్తేనేమి – భార్యాభర్తల్ని...

మనో : (తల వంచుకుంటుంది)

( తెర )

## రంగము ౨

రామమూర్తి ఇంట్లో గది – వివాహమై మూడు నెలలయింది. మనోరమ చదువుకుంటూ కూర్చున్నది – ఇంగ్లీషు ప్రథమ పుస్తకము.

మనో : ఛీ ! వెధవభాష ! ఎన్ ఓ నో, ఎస్ ఓ సో అయితే డి ఓ డో ఎందుక్కాదో... అడిగితే మాత్రం ఎవరు చెప్పగలరు ... అదీ వక స్వారస్యమే అంటారు కొందరు మహానుభావులు...(విసుగుతో పుస్తకంకింద

పారేస్తుంది.) అయ్యయ్యో! ఎంతపని చేశాను. వారు చూస్తే ఎంత విచారిస్తారు. (అని పుస్తకం తీసి బల్లపై పెడుతుంది) నా కోసం వారెంత త్యాగం చేస్తున్నారు! (నిట్టూర్చి) ఆ విషయాలు తలుచుకోకుండా వుంటేనే మంచిది. చదువుకుంటాను. (పుస్తకం పేజీ తిప్పి) బుద్ధి నిలవడంలేదు పాడుకుంటాను. (తంబుర శ్రుతిపెట్టి పాడుతూ వుంటుంది.)

ప్రవేశం : రామమూర్తి

రామ : (పాట ఆపగానే) మనూ! ఎందుకంత జాలిగా పాడతావెప్పుడూను...

మనో : (లేచి నవ్వి) నా స్వభావం గాబోలు.

రామ : కాదు. మనసులో ఏదో దుఃఖం వుందనుకొంటాను.

మనో : ఆఁ. దుఃఖమా! ఎంతమాట అన్నారు. మీరుండగా నాకు దుఃఖం కూడానా!

రామ : అదుగో, అలా అంటేనే నన్ను సందేహాలు చుట్టుకుంటవి...

మనో : మరి నన్నేమి చెప్పమంటారు... నాకేమి కష్టాలున్నాయి గనుక...

రామ : కష్టాలు లేనప్పుడు విచారమెందుకు?

మనో : (నవ్వి) చెప్పానుగా... స్వభావమని... కొందరు ఎన్ని కష్టాలున్నా సంతోషంగా వుంటారు... కొందరు ఏ కష్టాలు లేకపోయినా బాధపడుతూనే వుంటారు... లోకం చిత్రాల్లో ఇది వకటి.

రామ : లోకంలో చిత్రాల కేం తక్కువలే... ఆ దృష్టితో చూడాలి కాని...

మనో : కవుల కాదృష్టి ఎక్కువగా వుంటుంది కదూ...

రామ : అవును. ఆ దృష్టే కవులందరికీ సమానంగా వుంటుంది. మనవారినీ పాశ్చాత్యుల్నీ వకటి చెయ్యాలంటే ఆ దృష్టే పనికొస్తుంది ...మనూ, ఇంగ్లీషు చదువుకొంటున్నావు కదూ!

మనో : ఓ ... అయితేనండీ, వున్నమాటొకటి చెప్పాలి. సంశయం వకటి తీర్చాలి మీరు.

రామ : తీర్చగలిగితే.

మనో : మాతృభాషేగాక ఇతర భాషలు నేర్చుకోవడం కాలం వృధా చెయ్యడం కదా అని ... ఎలాగంటే పిల్లి అన్న వస్తువున్నదనుకోండి. దానికి తెలుగులో పిల్లీ అని చిన్నప్పుడు నేర్పుతారు. ఆ పిల్లికే సంస్కృతంలో మార్జాలం. ఇంగ్లీషులో 'క్యాట్' అరవంలో 'పూనై' అని పేర్లున్నాయని కష్టపడి నేర్చుకుంటానుకోండి. అందుచేత ఆపిల్లిస్వరూపం గురించిగాని, గుణగణాల గురించిగానిజ్ఞానం అధికం అవుతుందా! లేదు. అయితే ఈపదాలు నేర్చుకోవడంలో కాలం మాత్రం వ్యయమౌతుంది ...... ఔనంటారా? కాదంటారా?

రామ: ఔను. ఆవిధంగాచూస్తే అవును. కాని, భాషలు నేర్చుకోవడం కేవలం పదాలకోసరం కాదు. ఆ భాషల్లో

వున్న వాఙ్మయ సంపత్తికోసరం. అంతేగాదు. అనేక మాతృభాషలతో నిండివున్నట్టి మన దేశంలో సామాన్య భాష వకటి అభ్యసిస్తేనే గాని ఐక్యానికి భంగం వస్తుందని నా అభిప్రాయం. ఎందుకంటావా! ఒకరి భావాల్ని, ఆశయాల్ని, సుఖ దుఃఖాల్ని ఇం కొకరు కనుక్కోవడానికి ఇద్దరూ ఒక భాష ఎరిగుండ డం అత్యావశ్యకం...

మనో : తెలిసింది. ఈ భరతవర్షంలో పుట్టినందుకు అనుభ వించే ఫలాల్లో ఇదొకటి.

రామ : ఎందుకూ నీ కంత కోపం భరతవర్షంపైన?

మనో: కష్టాలు సుఖాలని నిరూపించడానికి కావలసిన వేదాంత జ్ఞానం లేని మూఢురాల్ని గనక... నేనిలా మాట్టా డితే మీకు నచ్చదుకదూ ... పాపం. నా కోసరం మీ రెంత బాధపడుతున్నారు ! ఎంత త్యాగం చేస్తున్నారు !

రామ : అబ్బబ్బ! ఆహార నిద్రాదుల్లేకుండా ఘోరతపం చేస్తు న్నాను.

మనో : కాదు. అలా చెయ్యడమే సులభమనుకుంటాను. లోకానికి వ్యతిరేకంగా నడుచుకొని బతకడాని కన్న తపం చేస్తున్నప్పుడు పడే కష్టానికి —ఫలమైనా వుం టుందనే తృప్తి వుంటుంది. చేసే పని తప్పుకాదని తనకు తోచినా లోకానికి విరుద్ధంగా తోస్తే అన్యా యంగా పరాభవమూ, బాధ.

రామ : నిజమే. కాని లోకంవిషయం బాగా ఎరిగిన వాణ్ణి నాకెందు కుంటుందీ బాధ.

మనో : పొరబాటు. ముల్లు గుచ్చుకుని బాధపెట్టే స్వభావం గలదని తెలిసినంత మాత్రంతో ముల్లు గుచ్చుకుంటే బాధ లేకుండా పోతుందా ఏమిటి!...అహఁ...నా దగ్గర ఎందుకు దాచడం ... నా మూలాన్ని మీ వాగు ఎందరో మీతో మొహమిచ్చి మాట్లాడ్డం లేదు. నాకు తెలియదనుకొన్నారా! మీ గడప తొక్కడం అసలే మానేశారు.

రామ: వారిదే బుద్ధితక్కువ.

మనో : కావచ్చును. గాని బాధపడేవారు మీరేగదా-అంతే కాదు...కారణం వుండో లేకనో నాపైన చాడీలు చెప్పి మీ మనసు విరిగింపడానికి ప్రయత్నం చేసే వాళ్ళున్నా లేకపోలేదు...అన్నిటినీ సహిస్తున్నారు.

రామ: కారణం వుండో లేకనో అంటే,—ఏం కారణం వుంటుంది?

మనో : ఎంత అమాయకులు! పోన్లెండి. కోప్పణ్ణని అంటే ఒక వుదాహరణం ఇస్తా...సరేనా...మీ మామ గారు పాపం, తన కూతుర్ని మీకిచ్చి వివాహం చెయ్యాలని గంపెడాశతో వున్నాడు. మీకూ నాకూ విడాకులైతే గాని సంబంధం కుదరదని తెలుసును... నిజమేనా...

రామ: (పలకడు, ఏదో ఆలోచిస్తున్నాడు.)

మనో : చూచారా, ఈ విషయం మాట్లాడితేనే ఆలోచనా, ఆవేదనా... బాధలేదు, త్యాగంలేదూ అని పైకి అంటారు... అందుకే నాకు సంతోషంగా వుండడానికీ వొప్పదు.

రామ: (నవ్వు తెచ్చుకొని) ఆఁ. దొరికావు... ఇంతకు ముందన్నావు నీకు కష్టాలే లేవని. అబద్ధమాడావు.

మనో : (నవ్వుతు) ఫరవాలేదు. మీ ఎగ్గిర నే నోడిపోవడం ఇది మొదటిసారి కాదులెండి.

రామ: పోనీ, ఇప్పుడు పాడు - సంతోషంగా.

మనో : క్షమించండి. వద్దు...

రామ: ఎందుకూ ..సంతోషంగా లేవా ?

మనో : (తల ఊపుతూ) సంతోషంగా వుండాలంటే భయం వేస్తుంది.

రామ: పిచ్చిదానవు. నీ ధైర్యానికి మెచ్చుకోవాలో, లేక నీ భయానికి నవ్వాలో తెలియడం లేదు...

మనో : (నవ్వుతు) నా ధైర్యానికి నవ్వుకొని నా భయానికి మెచ్చుకోండి.

రామ: మాటలు తిప్పేయడంలో రాణివి.

మనో : అవునవును. ఇప్పుడు మాటలు తిప్పిం దెవరో ?

ప్రవేశం నౌఖరు-ఒక కుర్రవాడితో

నౌఖరు: అమ్మగారు ! ఈ కుర్రవాడు ఏదో వుత్తరం పట్టుకొచ్చాట్ట. అమ్మగారిచేతుల్లో తప్పితే ఇవ్వడంట... (కుర్రవాణ్ణి వదిలి నిష్క్రమిస్తాడు.)

రామః (నవ్వుతు) బలే, ఆ కుర్రవాణ్ణి మంచి బోయ్ స్కౌట్‌గా తయారుచేయిస్తే బాగుంటుంది. ఒరే! ఎవర్రా రాస్త ఆ వుత్తరం?

కుర్ర : అందులో వుందంట బాబూ.

మనో : ఏది వుత్తరం.

కుర్ర : (వుత్తరం ఇస్తాడు.)

మనో : (త్వరగా చదువుకుంటుంది.)

రామః ఒరే, నీ పేరేమిరా?

కుర్ర : రామదాస్.

రామః మనూ! అంత రహస్యంతో పంపిందెవరో అడగవచ్చునా...నాకు తెలిసినవారైతే...

మనో : (కొంత కోపంతో) మీకు తెలియని వారెవరు? రాసింది మా నిరుపమ...జ్ఞాపకం లేదూ?

రామః (అంత ఉత్సాహం కనబర్చడు) లేకేమి!

మనో : చాలామంచి హృదయం గలది.

రామః నువ్వు చెప్పగా విన్నాను...ఏం రాసింది?

మనో : ఏం రాస్తుంది. విశేషాలేం వుంటవి గనుక...ఏమలా వున్నారు?

రామః అబ్బే! ఏమితోచక... (అంటూ వెళ్ళిపోతాడు.)

మనో : (ఉస్సురుమని) ఒరే! ఎవర్రా పంపింది నిన్ను.

రామః ఆ వుత్తరంలో వుంటుంది.

మనో : మంచి శిష్యుడివి దొరికావు ఆచార్లకి. (వుత్తరం విప్పి మళ్ళీ చూస్తుంది ఎవ్వరూ లేరుగదా అని. తరువాత నెమ్మదిగా చదువుకుంటుంది ...) 'ఋణ బాధల్లోచిక్కి బాధపడి కుళ్ళిపోతున్నాను..'...మద్య పానం ఎక్కువైంది గాబోలు...'అవమానం సహించ డానికన్నా ఆత్మహత్యే మేలు'-(అపహసించి) తప్ప కుండ ... 'అయినా పూర్వ పరిచయంచేత నిన్ను సహాయం కోరుతున్నాను'...నాతో పూర్వ పరిచ యమా - ఎంత అన్యోన్యం ... 'మంచిదశలో ఉన్నా వని నా ప్రార్థన నిరశించవద్దు. నీకు నే నేవుపకారము చేయకపోయినను దుస్థితిలో వున్న నాకు సహాయం చెయ్యమని కోరుతున్నాను' ... ఇప్పుడేం చెయ్యను. ఒరే! ఆచార్లవా రెక్కడున్నార్రా?

కుర్ర : ఇంట్లో పడుకున్నారండి.

మనో : పడుకున్నారా? ఈ సమయంలో.

కుర్ర : జబ్బుగా వున్నారండి. ఎంతో కష్టంతో రాశారండి ఈ వుత్తరం... మీ దగ్గిరే ఇమ్మన్నారండి——

మనో : సరే ఇచ్చావుగదూ ... వెళ్ళిపోవేం?

కుర్ర : (కొంచెం మెతకగా) ఉత్తినే వెళ్ళిపొమ్మనరని మా ఆచార్లుగారు గట్టిగా చెప్పి పంపారండి.

మనో : (నవ్వుచు) ఎంత నమ్మకం!... మారిపోయి, కాదు కాదు. ఎక్కువ కష్టంలో వున్నప్పుడు ఆ వేదన అలా అనిపిస్తుంది గాబోలు ... నిరీక్షిస్తున్న సహాయం తప్పక

వస్తుందనే భావమే కొంచెం ధైర్యమిస్తుంది... పాపం! ఎంత దీనంగా రాశారు. ఇంతకాలం బ్రతికి ఎంత స్థితికొచ్చాడు... ఒరే! ఏమైనా ఇస్తే భద్రంగా పట్టుకెళ్తావా?

కుర్ర : పట్టుకెళ్తానండి.

మనో : (తనకు తాను) ఏం పంపను? వుపయోగించేమాత్రం సొమ్ము చేతులో లేదు... వారి నడగనా?... అబ్బ! వద్దు వద్దు, ఈ గొడవ వారికెందుకు... నా పూర్వ వృత్తాంతమే మరచిపోవాలని చూస్తుంటే ఇప్పుడు నేనే ఎందుకు వెళ్ళగించడం... (ఏమీ చెయ్యడానికి తోచక వేళ్ళు మెలిపెట్టుకుంటుంది. చేతికి ఉంగరం తగుల్తుంది.) ఆఁ... మరచిపోయాను, వారూ మరచి పోయుంటారు. పెట్టిలో వుండేదేగా ఆ వుంగరం, ఎవరి వేలికీ పట్టదు... అది పంపుతా (ఆలోచించి) అవును అదే. ఇంకేది పంపినా నేడు గాకపోయినా రేపైనా తెలిసిపోతుంది. ఎక్కడా వస్తువంటే అబద్ధమాడవలసి వస్తుంది..ఒరే! ఇక్కడే వుండు. (నిష్క్రమించును.)

కుర్ర : (మనో వెళ్ళగానే చూస్తాడు, ఇటూ అటూ బల్లపైన ఏదైనా సంగ్రహించడానికి ఉందేమో అని)

మనో: (ప్రవేశించి చాటుగా) ఇదుగో పెట్టె, భద్రంగా తీసి కెళ్ళయ్యి. జేబులో పెట్టేసుకో... వెళ్ళు ... ఆఁ... ఉండుండు. మీ ఆచార్లవారికి ఉత్తరం వకటి ఇస్తాను. (బల్లపై కాగితం కోసరం చూస్తూ) ఎందుకూ ఈ

ఉత్తరం నా దగ్గిరుండడం. దీనిపై నే రాసిపంపిస్తాను. (కలం తీసుకొని రాస్తుంది) ఇద్గో ఇది జబాబని చెప్పు. వెళ్ళిపో. (మాటలు వినబడతాయి.) వారు వస్తు న్నారు... వెళ్ళిపో... పో...

కుర్ర : (మెల్లిగా వెళుతున్నాడు.)

ప్రవేశం : రామమూర్తి శోభనాద్రిరావు, మేనమామతో మాట్లాడుతూ.

రామ : రా, మామయ్యా! రా, కాసేపు కూర్చొని వెళ్ళ రాదూ.

శోభ : ఊఁ. (వెళ్ళిపొయ్యే కుర్రవాణ్ణి చూస్తారు) ఎవరీ కుర్రవాడు... దేవాలయంలో చూచినట్టున్నాను...

రామ : (వినిపించుకోనట్టు) ఆఁ... అవును.

మనో : కాఫీ పుచ్చుకుంటారా?

శోభ : ఊఁ... ఆఁ... ఇప్పుడే పుచ్చుకొచ్చా.

మనో : సుభద్ర బాగుందా.

శోభ : ఎవరూ? ... సుభద్రా – అమ్మాయి సుబ్బేనా? ఊఁ. (చుట్టతీసి అగ్గిపెట్టె కోసరం తడుముకుంటు న్నాడు.)

మనో : (చటుక్కున బల్లపైన అగ్గిపెట్టె తీసి వెలిగించి అంది స్తుంది)

శోభ : (ఏమనడానికి తోచక చుట్ట వెలిగిస్తాడు.)

మనో : మాట్లాడుకుంటారు గాబోలు. సెలవు... (రాముతో) మీరుగన కాఫీ పుచ్చుకుంటారా.

రామ : అవసరం లేదు. కావలిస్తే పిలుస్తాను లే.

మనో : (నిష్క్రమణ)

రామ : ఏం మామయ్యా! మా యింటికి రావడమే మానేశారు.

శోభ : (ఊరుకుంటాడు)

రామ : ఏదన్నా కోపమా?

శోభ : కోపమా? వస్తే కోపం నీకు రావాలి. నాపైన, నా మాటలికి, ఏం?

రామ : అయ్యయ్యో! పెద్దవారి మాటలకు కోపం చేసుకుంటానా? ఎందుకొచ్చింది మీకా అభిప్రాయం.

శోభ : సరే. మీ యింటి కెందుకు రావడం లేదంటావా నిజంగా?... ఇది మీ యిల్లనే భావం పోయింది.

రామ : కారణం?

శోభ : అబ్బాయి! కారణం అడుగుతున్నావు గాని అంత ఊహించ లేక పోయావు ... ఇల్లూ వాకిలీ అన్న భావం దేనిపైన ఆధారపడి వుంటుందో అందులోనే లోటు మరి...

రామ : లోటు ఎలాగు? నేనూ, మనోరమా! ఇంతకన్నా కావాల్నా ... గృహస్థ ధర్మం నిర్వహిస్తున్నానే.

శోభ : ఆ...

రామ : ఎందుకు సందేహిస్తున్నారు-చెప్పండి.

శోభ : (గబగబా) నువ్వు దాన్ని పెళ్లాడానని వందసార్లు చెప్పినా నా కండ్లకి అది నీ భార్యగా ఎన్నటికీ కన పడదు. అందుచేతే నీకు పెళ్ళయినట్టే భావించను.

రామ : అయ్యయ్యో! పెద్ద రిలా అంటే నేనేం జెప్పను. మనోరమను శాస్త్ర సమ్మతంగానే వివాహమాడాను కదా... ఎందుకు మరి భార్యగా గణింపరు.

శోభ : శాస్త్ర సమ్మతమంటే ఏ శాస్త్రంగా? ఈ కొత్త చట్టాలేనా? అదే నీ పొరబాటు. వివాహమంటే ఒక పురుషుడు స్త్రీ కలిసుండడమని అనుకుంటున్నావు. దాని కాధారం ప్రేమ అనుకుంటున్నావు. ఇవన్నీ మన సంఘానికి చెందే భావాలు కావబ్బాయి!... కావు... ఎరువుల సొమ్ము బరువుచేటు — అయితే ఆ ఎరువుసొమ్మే అందంగా వుంటుంది. అలా అయి పోతూ వుంది మన దేశం... మన శాస్త్రాల ప్రకారం వివాహం ప్రేమకోసమే ఏర్పడింది కాదు. అంతే కాదు. అసలు వివాహం చేసుకొనే వాళ్ళ కోసరం కన్నా ఇతరుల కోసరమే ఏర్పడిందన్నా కూడా తప్పు గాదు.

రామ : అనగా సంఘానికోసరమా?

శోభ : ఊ... వంశోద్ధరణ కోసరం. కులోద్ధరణ కోసరం ధర్మ నిర్వహణ కోసరం... అందుకనే సంబంధాలు తలిదండ్రులు, పెద్దలూ నిశ్చయిస్తారు గాని వధూ వరులు కుదుర్చుకోరు. ఇంతెందుకూ? మా వెంకిన్నీ,

బావాన్నా బతికుంటే నిన్ని వివాహం చేసుకో నిచ్చే వారా? మన కులంలో మాంచి సంప్రదాయం గల చోట్లో వెతికి ఏ పిల్లనో కట్టేవారు.

రామ: ఒప్పుకున్నా ననుకోండి. కాని మించిపోయింది గదా. ఎలాగో ఓలాగు సర్దుకోవాలి గాని...

శోభ : ఏం మించిపోయింది?

రామ: మీ కందరికీ సమ్మతంగా వుండే సంబంధం చేసుకో డానికి—

శోభ : కారణం?... నీవు కిరస్తానంలో ఇంక కలవలేదను కుంటాను. ఇక మతస్మృతుల ప్రకారం ఎందరినన్నా వివాహ మాడవచ్చు పురుషుడు - భరించగల శక్తి వుంటే... లేదు, వృద్ధాప్యమా నీకు. - ఇంటినిండా పిల్లలా, దారిద్ర్యమా ... ఏమిటి నాయనా మించి పోవడానికి కారణం?

రామ: మీ రలా మాట్లాడుతున్నారు గాని ఎరగరా? మనో రమను ద్రోహం చెయ్యడమే!

శోభ : ద్రోహమంటే! నిన్నేమన్నా ఆవిడను వీధిలోకి వెళ్ళగొట్టి అన్నాహారాలు లేని అవస్థలో పెట్ట మన్నానా?... ఇంతెందుకు, నీకు అంత ఇష్టంగా ఉంటే సంబంధంకూడా వదులుకోమని చెప్పను.

రామ: ఆ మాత్రంతో ముగిస్తే సరిపోతుందా మామయ్యా! సర్వమూ నేనే అని నన్ను ప్రేమిస్తూ ఉన్న మనో రమ ప్రేమకు ద్రోహమా?

శోభ : (పకపక నవ్వును)

రామ: అలా నవ్వుతున్నా రెందుకు?

శోభ : ఎంత వెర్రివాడవోయి! నీ మాటలు వింటే ఎవరో అరుంధతీ దేవో, దమయంతో చంద్రమతో అను కుంటారు సుమా!

రామ: తమరు మనోరమ గుణం బాగా ఎరుగరు. అవకాశం లేదు...

శోభ : అయ్యో! అవకాశం కావాలా ప్రత్యేకించి. ఆ బ్రతుకు బ్రతికిన తరువాత గుణమూ, శీలమూనా? నాయనా, నామాట విను. లోకంలో జ్ఞానం అంతా అనుభవం పైన ఆధారపడిఉంది. ఆ అనుభవం నాకు వయసు వల్లనైనా కొంత కలిగింది. అందుచేతనైనా సావధానంగా విను. ఈ కాలంవారు వంశానికీ, కులానికీ, గుణానికీ సంబంధం ఏమీ లేదని చెప్తారు. కాని వాళ్ళందరూ అనుభవంలేనివాళ్ళు. పుట్టిన పుట్టక, బ్రతికిన బ్రతుకూపట్టి గుణగణాలు ఎంతో మారుతూ ఉంటవి ... మనోరమ విషయంలో ఆ హంశాలు బాగా తెలుసును నాకు. ఆ తరహా స్త్రీలకిన్నీ మంచి నడవడికకిన్నీ చాలా దూరం... ఆగు ... నీ వేమంటావో గ్రహించాను... నిన్ను వివాహం ఆడినప్పటి నుంచి మారిపోయిందని... అదంతా పైకి. పాతవాసన ఎప్పటికీ పోదు.

రామ : అంతా విన్నాను మామయ్యా, సావధానంగా ... మీరు పొరబడ్డారు ... నిజంగా ...

శోభ : (లేచి) సరే చూద్దాం—ఇక నే వెళ్లాలి.

రామ : ఏమీ అనుకోకండేం ... అన్యథా ... మీ మాటంటే గౌరవం లేక కాదు.

శోభ : అబ్బే ! ఎప్పుడూ అలా అనుకోను...

నౌఖరు : (ప్రవేశించి) సుబ్బారావుగారు వచ్చారండి.

రామ : రమ్మను రమ్మను ...

సేవకుడు నిష్క్రమించును.

శోభ : మన వడ్లమూడివారి అబ్బాయేనా ? ... పాత స్నేహితులు మాట్లాడుకోండి ... వెళ్ళిపోతాను.

రామ : మళ్ళీ ఎప్పుడు ...

శోభ : అయితే రాకుండా వుంటానటోయి !...

శోభనాద్రిరావు వెళ్ళుతుండగా సుబ్బారావు ప్రవేశించును.

సుబ్బా . (నమస్కరించును)

శోభ : స్నేహితులకు మధ్య మే మెందుకూ ఆటంకం— ముసలివాళ్ళము.

సుబ్బా : ఆఁ ఆఁ !

శోభ : ఉత్తినే అన్నాను...(నిష్క్రమించును)

సుబ్బా : ఏమోయ్ ! మీ మామయ్య అంత సంతోషంగా వెళ్ళడం లేదు. ఏమైనా లెక్చరు ఇచ్చావా ?

రామ : లేదు—ఆయనే యిచ్చాడు లే.

సుబ్బా : ఏమని ? ఆడపిల్లలకి పుట్టకముందే వివాహం చేసెయ్యాలనా ?

రామ : కాదు.

సుబ్బా : 'ఎ బి సి డీ లు ఎక్కువాకొద్దీనీ, వేదశాస్త్రంబులు వెనుకబడియె' అనా.

రామ : కాదుగాని, ఆయన మాటలు చాలించు. అంత హాస్యంగా లేదు...

సుబ్బా : అదేమిటి అలా కరుస్తున్నావు ?

రామ : సరేలేవోయి. నీవు మాట్లాడే ప్రతి మాటకీ నవ్వితే ఆల్ రైట్; లేకపోతే ఆల్ రాంగ్. ఎప్పుడూ ఆ విధానమే అనుసరించడానికి వీలవుతుందా చెప్పు.

సుబ్బా : అబ్బో !

రామ : (పరధ్యానంగా ఆలోచిస్తూ ఉంటాడు)

సుబ్బా : మూర్తీ ! పరిహాసంకాదు. ఏదో నిన్ను వర్రీచేస్తూ ఉంది.

రామ : ఈ వీధిజోస్యం చాలులే...

సుబ్బా : ఆఁ. అలాగా... నిజంగా, ఏదీ నన్ను చూడు ... మొఖం తిప్పేసుకొని కాదు... నిజంగా చెప్పు ఏమీ లేదని.

రామ : (చిరాకుగా) ఏవో ఉంటాయి లక్షలు.

సుబ్బా : లక్షలు లేవు, కోట్లూ లేవు... ఉన్నది ఒక్కటే.

రామ : అంటే...

సుబ్బా : ఇలా బాధపడుతావని నా కప్పుడే తెలుసును.

రామ : బాగానే ఉంది. విషయమేమిటో తెలియకుండా విసిరేస్తున్నావు వాక్యాలు.

సుబ్బా : ఎందు కీరహస్యవేదన !... ఇప్పటి నీ స్థితికి కారణం మనోరమ... స్వల్పంలో చెప్పేశాను.

రామ : (మాట్లాడడు)

సుబ్బా: ఇలాటి వివాహాలు ఎక్కడా దుఃఖాంతంగానే పరిణమించాయి... డాక్టరు చంద్రశేఖరం ఈ రోజు పెళ్ళి ఆడాడు... సంవత్సరం తిరగలేదు, ఆవిడ అతని స్నేహితుడితో లేచిపోయింది. మళ్ళీ బ్రహ్మచర్యావస్థలో ఉన్నారు... ఇక ఆ కోమట్లబ్బాయి సుబ్రహ్మణ్యం గుప్త అప్పుడే ద్వితీయ వివాహం. బంధువులందరూ ఏమంటున్నారు 'అబ్బే! వివాహం లేదు ఏమీ లేదు. ఉంచుకున్నాడు' అని వ్యాఖ్యానం సహా' ఎవ్వడూ సుఖం అనుభవించినవాడు నా పాడు కండ్లకు కనబడడు...

రామ: ఎంతసులభం ఇలా మాట్లాడ్డం!... ఈ విధంగా సమర్థించడం... ఇష్టం లేకపోతే సరి కారణాలు అవసరం లేదు.

సుబ్బా: అది కాదోయి...ఎలా కుదురుతుందోయి చెప్పు.

రామ: ఏమో అంత విరోధం! ఏమో అబ్బబ్బ... లోకులు కాకులంటే అర్థమయేది కాదు...లోకాభిప్రాయానికి విరుద్ధమైతే సరి... ఎంత మంచిపని అయినా పాప

కార్యమే...ఎంత సత్యమైనా అబద్ధమే ... ఎంత అన్యాయమైనా న్యాయమే...కదూ! మనుష్యులకు ప్రత్యేకంగా న్యాయా న్యాయ విచక్షణ ఒకప్పుడు ఉండవచ్చును గాని– సంఘానికా ... రామ రామ... సంఘానికి విచక్షణ లేదు. వివేకంలేదు...ఇంతెందుకు సంఘానికి హృదయమే లేదు——

సుబ్బా: అయితే ఏమి చెయ్యడం...సంఘాన్ని వదిలేసి సన్యసించలేదుగా!...సంఘంలోనే కదూ మనం జీవించడం.

రామ: బహుశా, ఆ మార్గానికే దిగుతానేమోలే!...

సుబ్బా: మూర్తీ! కొంచెం ఓర్పుండవలెనోయ్. చూడు ఇంగ్లీషులో అంటారే అలా... చర్మం గట్టి చేసుకోవాలోయి... లేదా లోకాన్ని అనుసరించాలి. పోని లెద్దూ! నేను వచ్చిన దొకందుకు, వృథాగా మాటలు పెరిగాయి. కారులో బెంగుళూరువరకు వెళ్ళాలని ఉద్దేశం. వస్తావా.

రామ: చూస్తాను...ఈలోపుగా సంఘాన్ని వదిలేయకుండా ఉంటే...

సుబ్బా: (నవ్వుచు) అంతేకద! రేపు క్లబ్బులో కనబడవు.

రామ: ఊఁ

సుబ్బా: (నిష్క్రమించును.)

రామ: (బల్లపైనున్న ఉత్తరం కవరునుచించుతూ కూర్చుంటాడు తీవ్రంగా ఆలోచిస్తూ.)

ప్రవేశం: మనోరమ

మనో : (మెల్లిగా రాము వెనక నిలబడుతుంది)

రామ: (కదలడు.)

మనో : అబ్బా! ఎంత బాధపడుతున్నారు... ఎందుకూ! పానకంలో పుడకలాగా మీ సౌఖ్యానికి అడ్డు వస్తా ననుకున్నారా ... ఏ క్షణం మీకు అసహ్యమై పోతానో ఆ క్షణం వెళ్ళిపోతాను.

భుజంపైన చెయ్యి మృదువుగా ఉంచును.

రామ: (చటుక్కున మనో చెయ్యి తన చేతితో పట్టుకొనును.)

( తెర )

## అం క ము 3

మనోరమ, ఆచార్యులు కూర్చున్నారు. కొంతసేపు మాట్లాడ రెవ్వరు.

మనో : చీకటిపడుతోంది వెళ్తారా ?

ఆచా : (ఇకిలిస్తూ) అంతేనా ? అలాగే వెళ్ళిపొమ్మంటుందా మా బంగారు మను ? అఁ.

మనో : (విసుగుతో) మీకు నమస్కారం! అలా మాట్లాడ కండి.

ఆచా : రాణీ దర్శనం చేసుకొని ఉత్తిచేతుల్తో వెళ్ళే దౌర్భాగ్యులు కూడా ఉంటారా అఁ ... నీవు రాణివి కావూ ...?

మనో : ఇంతవరకు మాట్లాడినంత సేపు ఊరుకున్నాను ... ఆరు ఘంటలు కూడా దాటిపోయినవి. . . ఇక వెళ్ళరు ?

ఆచా : చిన్నప్పటినుంచి తెలుసు నాకు. నీది జాలిగుండె. నోరు లేని జంతువైనా సరే ఆకలితో ఉంటే ఆహారం వేసేవరకు తహతహ పడేదానవు.

మనో : వెళ్ళరూ ?

ఆచా : ఇం తెందుకు. నిదర్శనాలు ఎక్కడో వెతకడం ఎందుకు... మొన్న నా ఉత్తరం చూచుకొని ఎంత బాధపడ్డావో, ఎరగనా ? ఎంత దయార్ద్ర హృదయం కాకపోతే హఠాత్తుగా తత్ క్షణమే చేత నున్న అంగు ళీయకం పంపావు!... వెన్న ... వెన్నవంటి మనసు... నవనీతం...

మనో : ఉంగరం చేతిది కాదులెండి... ఉపయోగం లేదనే పంపాను. పోనీయ్యండి మీ కోరిక నంతగా పాటించి వెంటనే పంపానుగదా... నా కోరిక కూడా మీరు చెల్లించవద్దూ... ఆ ఉత్తరంలోనే వ్రాశానే ఇక నా జోలికి రావద్దని...

ఆచా : ఆఁ ఆఁ అంత కఠినంగా నియమిస్తే మాత్రం అనుస రిస్తానా. అనుసరించగలనా ... అంతకృతఘ్నుతా?... నా కంఠంలో జీవంఉండేవరకు నిన్ను వదలడమే... నా బంగారు మను తప్ప నాకు దిక్కెవరు ? ... ఆఁ... చెప్పు.

మనో : (నిట్టూర్పుతో) మీ రేదో కారణార్థంగా ప్రవర్తిస్తు న్నారు ఈ విధంగా... అయ్యా ! నమస్కారం వేడు కొంటాను.

ఆచా : దీర్ఘ సుమంగళీభవ !—

మనో : ఏదో కొద్దో గొప్పో నా శక్తికొద్ది పంపితినిగదా... సాయం చేసినందుకా ఈ విధంగా బాధిస్తున్నారు. వెళ్ళిపోండి... మళ్ళీ వెళ్ళిపోండి... మళ్ళీ ఈ వైపుకు రాకండి.

ఆచా : ఆఁ ! అంతధైర్యం వచ్చిందీ ! ... వెధవ ఉంగరం వకటి - పనికిమాలినది - నా మొఖాన కొట్టేస్తే సరి పోతుందనుకున్నావా? ... ఈ వైపు రాకూడదమా ? ... గడిచి గట్టెక్కావు నీవు... బంగారుపడకమీద పవ్వళించావు ! వెనకటి బ్రతుకు, పాత స్నేహితులూ మరిచిపోయావు గాబోలు ? మిడిచిపడకు - నీలాంటి వాళ్ళని చాలామందిని కాచి వడపోశాను ... ఈ భోగం అంతా నీపైన మోజు వున్నంతవరకే...

మనో : చాల్చాలు ! ఒళ్లు తెలియకుండా వాగేస్తున్నారు. పాముకు పాలుపోస్తే మాత్రం విషం మారిపోతుందా. చాలులెండి. ఇక వచ్చినదారిని మీరు వెళ్ళిపోతేనే మీకూ నాకూ మర్యాద నిలుస్తుంది.

ఆచా : (కోపంతో) ఓహో ? మర్యాద నిలబెట్టుతావుగా - ఓసిముండ.

మనో : ఆగండి. ఇక అలాటి మాటలు కూడా ప్రయోగిస్తే గెంటించేస్తాను.

ఆచా : లేచి ఏదీ ! ఏదీ ! చూస్తాంగదూ.

మనో : ఛీ ! వెళ్ళండి పరువుగా.

ప్రవేశం : రామమూర్తి, ఈ సంవాదం చూచి భ్రమసి, విచారంతో కొంతసేపు నిలిచి, కినిసి ఆచార్యులవంక చూస్తూ.

రామ : మనూ! వీరెందుకు వచ్చారు.

ఆచా : (నవ్వుతు) అబ్బాయి! ఎంత ప్రశ్న వేశారు! నే నిక్కడకు రావడానికి కారణం గొప్పగా ఉండాలా! మా మనోరమను చూడడం కంటే గొప్ప కారణం కావాలా ?... మీ మనోరమ వగా మనోరమ అన్నది నేను మరచిపోతానా, అమ్మాయి మరచిపోతుందా.

రామ : మనూ ! నీవు ఆహ్వానించావా.

మనో . (తల త్రిప్పుతుంది లేదని)

ఆచా : తాంబూలయుక్తంగా ఆహ్వానం ఉండాలనా ఏం ? నన్ను కలుసుకోవాలని మనసులో ఆదుర్దా వుందని నాకు తెలిస్తే చాలదూ ?

మనో : ఛీ !

ఆచా : అహం. దాస్తే దాగుతుందా, అంతమాత్రం అర్థం చేసుకోలేమా అబ్బాయి.

రామ : అయ్యా ! నాకీ వ్యవహారం అంతా నచ్చడం లేదు, తమరు వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నట్టు కనపడ్డది ... ఎందుకు వృధా కాలయాపనం. నేనేదో అడిగాను తమరు ఏదో చెప్పారు ...అంతే...

ఆచా : (ఇకిలిస్తూ) ఈ కాలం కుర్రవాళ్ళకి ఎంత ఓపిక తక్కువో !

రామ : అయ్యా ! ఆలస్యమవుతూ వుంది.

ఆచా : వెళ్తాను బాబూ, వెళ్తాను. మనోరమని దయగా చూచుకొంటారు గదూ. చాల కోమలహృదయం.

రామ : (చెయి జేసుకొనుటకు ఉద్యమించి మరల ఆగి, తలుపు వంకకు వెళ్లును)

ఆచా : (దొంగచూపులు చూస్తూ మెల్లగా నిష్క్రమించును)

మనో : (తల వంచుకొన్నది)

రామ : (గుమ్మము దగ్గరనుంచి మనోరమవద్దకి మెల్లిగావచ్చి) కఠినంగా నీ వెనకటి జీవితంతో సంబంధం పూర్తిగా తెగగోసుకుంటి వనుకున్నాను.

మనో : (తల ఎత్తి ధైర్యంగా) నిస్సందేహంగా—

రామ : ఓహో... అయితే వీ రెందుకు వచ్చారు ?

మనో : నన్నడిగితే ! నేను రమ్మన లేదు.

రామ: వచ్చాడు సరే-ఎందుకో-ఇంత అసహ్యంగా ప్రవర్తించా రెందుకు ? - ఎందుకలా మాట్లాడాడు ? నాకేదీ అర్థంకావడం లేదు.

మనో : సత్పురుషుల కెప్పటికి అలాంటివారి స్వభావం గాని, నడవడిక గాని, ఆలోచనలు గాని అర్థంగావు. లోకంలో ఉన్న దుర్మార్గం, అన్యాయం, కుటిలత్వం మీరు ఊహించనైనా లేరు. అందులో అటువంటి పరమ పాతకిని మీరు గ్రహింపగలరా? వారిమాటలు మీకు బోధపడుతవా ?

రామ: ఎంత కోపము !

మనో : కోపమా! ఎంతమొత్తని పదము ఉపయోగించారు. అట్టివారిని చంపినా పాపంలేదు. నా మతంలో అట్టి వారి సంగతి మీరు మరచిపోతేనే ఉత్తమం. (వెళ్ళి పోతుంది.)

రామ: (ఊరుకున్నాడే గాని ముఖంలో సంతుష్టి కనబడదు. సందిగ్ధావస్థలో ఉన్నాడు. బాగా చీకటి పడుతోంది. దీపం బల్లమీదది వెలిగిస్తాడు.)

(ప్రవేశం: శోభనాద్రిరావు సంభ్రమంగా)

రామ: (తిరిగి) ఏమి మామయ్యా! ఇప్పుడు వచ్చారు రాత్రి వేళ!

శోభ : ఇంత త్వరగా ఈవేళ వస్తానని నేను మాత్రం అనుకున్నానా? అలాంటి సమయం వచ్చింది గనుక తప్పనిసరి-వచ్చాను.

రామ: అంత రాచకార్యం?

శోభ : మొదట తొందరపడ్డా తరవాత నిదానిస్తావులే.

రామ: మామయ్యా! ఏమి చెప్పడానికి వచ్చారో చెప్పివేయరాదూ... నాకు ఉన్నమతి కూడా పోతూవుంది.

శోభ : (నవ్వుతు) చదువుకున్నవాడవు, నవనాగరికతలో మునిగి తేలేవాడవు ..అంత ఖంగారుపడితే ఎలాగు?

రామ: (పలకడు.)

శోభ : చెప్తానులే, అల్లా కూర్చో.

రామ: కుర్చీపైన కూర్చుంటూ మీరూ కూర్చోండి.

శోభ: (కూర్చుని) ఇక్కడ ఎవ్వరూ లేరుగద.

రామ: ఎవరుంటారు ? లేదు, మనోరమ సహా లేదు... ఏమి టంత రహస్యం ?

శోభ: (జేబులోనుంచి ఉంగరం తీసి) చూడు? ఈ ఉంగరం ఎప్పుడైనా చూచిన జ్ఞాపకం ఉందేమో ? (ఉంగరం ఇచ్చును.)

రామ: (పుచ్చుకొని, దీపం వెలుతురున పరీక్షించి పోల్చు కొని) ఓ ! నాదే ఉంగరం. అనగా నేను కొన్నాను. కాని మనోరమకు ప్రజంటు చేశాను... అయితే ఈ మధ్య ఉపయోగించడం లేదు.... (నిశితంగా) మామయ్యా ! ఈ ఉంగరం మీ కెక్కడ దొరికింది? ఎవరిచ్చారు ? ఎప్పుడు ? ఎందుకు ?

శోభ: ఇన్ని ప్రశ్నల కొక్కటేసారి జవాబు చెప్పడానికి ఇది విడుపు కథకాదు. మెల్లగా సావకాశంగా వింటే సర్వమూ తెలుస్తుంది. ఎక్కడ దొరికిం దని అడి గావు. చెప్పగలను, సావుకారు పరమానంద దాసు కొట్లో.

రామ: ఆఁ ! ఎలాగు ? మా యింట్లో చోరీ జరిగింది నేనిది వరకు ఎరగను.

శోభ: చోరీ లేదు. గోరీ లేదు. దీన్ని తాకట్టుపెట్టి డబ్బు తీసు కున్నారు.

రామ: ఎవరు... (మెల్లగా బాధతో) మనోరమనా—

శోభ : కాదు. ఈ రంగాచార్యులు, దేవాలయం అర్చకుడు.

రామ: ఏమీా ! ఆచారి ! - నిజంగా ?

శోభ : (కోపం తెచ్చుకొని) లేదు, కల్పించుకొని పెద్ద రామాయణం చెప్తున్నాను.

రామ: క్షమించండి-మీా మాటలో నమ్మకం లేక కాదు... నామీాద నాకే నమ్మకం పోతూవుంది. ఈ ఉంగరం ఆచారికి వచ్చిన విధం తెలుసునా ?

శోభ : ఊహించవచ్చును గాని నిష్కర్షగా చెప్ప లేను.

రామ: మామయ్యా ! నాకోసరం ఒకపని చెయ్యాలి... తప్పకుండా... వెంటనే దేవాలయానికి వెళ్ళి ఆచారిని పిల్చుకుని రండి. అప్పటికిగాని యథార్థం బయట పడదు ... శ్రమ అనుకోరు గదూ.

శోభ : ఎంత వెర్రివాడవోయి! శ్రమ అనుకునే గాబోలు ఈ ఉంగరం తీసుకుని నీ దగ్గరికి పరిగెత్తుకొని వచ్చాను.

రామ: నా మనసు బాగా లేదు. నా మాటలు పాటించకండి.

శోభ : సరేలేవోయి ... (వెళ్ళుతూ) జాలేస్తూ వుంది నీ అవస్థ చూస్తే (నిష్క్రమణ)

రామ: (పిచ్చివానివలె తిరుగుచుండును.)

ప్రవేశం : మనోరమ

మనో : మీ మామగారు వచ్చి వెళ్ళారు ఇంత రాత్రివేళ ఎందుకో.

రామ: (యథార్థస్థితి దాచుటకు ప్రయత్నిస్తూ) అబ్బే ! ఎందుకూ లేదు. నాకు సంగీతం అంటే అభిరుచి ఎక్కువ అని తెలుసును; రేపు ఆదివారం సంజీవరావు గారి వీణాగానం ఉన్నది, రావచ్చునని చెప్పడానికి వచ్చాడు.

మనో : (నవ్వుతు) హాయి హాయి ఒక్క వాక్యంలో ఎన్ని తప్పులు చెప్పేశారు. ఆదివారం నిన్న. రేపు కాదు. సంజీవరావుగారి కచ్చేరీ రేపు జరగదు. ఇవ్వేళ ఆంధ్రపత్రికలో వారి కచ్చేరీ మద్రాసులో జరుగునని ఉన్నది. ఇన్ని తప్పులు చెప్పడానికా వచ్చారు మామయ్యగారు !- కాదు ఏదో రహస్యం దాస్తున్నారు.

రామ: రహస్యం దాస్తామనుకున్న వారు పిచ్చివారు. రాత్రి రహస్యం ప్రొద్దున్న బట్ట బయలు.

మనో : అదేమిటి అలా ఉన్నారు ?

రామ : అవస్థలు నాలుగని రూఢి అయినా నిజంగా లెక్క లేనివి.

మనో : మీ రెండు కీ అవస్థలో ఉన్నారు ?

రామ: కారణాలు వెతికే మానవునికి సంతృప్తిగాని, సంతోషంగాని దుర్లభం.

మనో : అబ్బ ! మీ వైఖరి చూస్తే భయంవేస్తూ ఉంది.

రామ: మనసులో పాపచింత లేని వారికి భయం వెయ్యదు.

మనో : ప్రియమైన వ్యక్తి అకారణంగా బాధపడుతూ ఉన్నప్పుడు ఎట్టి సత్యసంధులకైనా భీతికి సహజం కాదా!

రామ: అదుగో మళ్ళీ కారణాలంటున్నావు. మనకర్మకు కారకులం మనం కామూ ?

మనో : మీ రిలా మాట్లాడుతూ ఉంటే నాకు పిచ్చెక్కుతుంది... పరిహాసం కాదు.

రామ: వెర్రివాళ్ళకి, ఇతర్లకూ ఏమీ భేదంలేదు. దృష్టి భేదం తప్ప. వెర్రివాళ్ళకి ఇతర్లు వెర్రివాళ్ళుగా కన బడతారు. కిటికీ దగ్గర నిలబడి చూచును.

మనో : ఎవరు ?

రామ: ఎవరూ లేరు...

మనో : కూర్చోరూ ?... నాతో ఏమీ చెప్పరేం డి... బాధ పడకుండా ఉండడానికి నేనేదైనా చెయ్యగలిగితే చెప్పండి చేస్తాను.

రామ: (వికటంగా నవ్వును)

మనో : (చప్పుడు విని ఎవరో వస్తున్నారు)

రామ: (తటాలున గుమ్మమువంక తిరుగును.)

ప్రవేశం: శోభనాద్రిరావు, ఆచారితో.
ఆచారి మద్యపాన మత్తుడుగా ఉన్నాడు.

మనో : (చలనంలేకుండా చూస్తున్నది)

శోభ: ఇదుగో ఆచార్యులవారు.

ఆచారి: (మత్తుగా) వెళ్ళిపొమ్మంటే వెళ్ళిపోతాము. రమ్మంటే వచ్చాము.

రామ: అయ్యా! ఉంగరం చేతికిచ్చి చూడండి! ఈ ఉంగరం ఎప్పుడైనా చూచారా?

ఆచా: (చూచి) అదే! అదే. బాబూ వదిలించుకొన్నారా డబ్బిచ్చి - గొప్పవారు-ఉదార స్వభావులు.

రామ: సాహుకారు కొట్టులో ఉంచింది మీరేనా?

ఆచా: అవును... కాదన్నాడా?

రామ: తొందరగ ఉంగరం మీదేనా?

ఆచా: ఆహా!

రామ: ఎక్కడ కొన్నారు?

ఆచా: (బిగ్గరగా నవ్వుచు) అంతమాత్రం ఉంగరం నేను కొనడమే! శెహబాష్.

రామ: మరి మీకెల్లా లభించింది?

ఆచా: చెప్పవలసిందేనా ... (దొంగచూపుతో) చెప్పితే మాత్రం తప్పేమి. మా మనోరమే (చూపించి) పంపింది...అంటే నాకు దానంచేసింది. ఆవిడ దయార్ద్ర హృదయం వర్ణించాలా. మీ కందరికీ తెలియకుండా—పాత్ర మెరిగిన సమయం కనిపెట్టి చేసిన దానమే గొప్పదానము. అల్లా చేసినవారే గొప్పదాతలు.

శోభ : (తనలో మళ్ళీ కొంత బిగ్గరగానే) నేననుకొన్నట్టే అయింది...

రామ : అయ్యా! చాలా శ్రమ ఇచ్చాను మీకు—

ఆచా : అయ్యో! అయ్యో! ఎంతమాట, ఎంతమాట! అందులో మీరొకరున్నూ, మనోరమ ఒక తేనునా.

రామ : సెలవు మామయ్యా! ఇక నేమీ మాట్లాడలేను. ఈ రోజు ... మీరు చేసిన ఉపకారానికి ప్రతీకారం చెయ్యలేను. ఇదుగో నమస్కారము.

శోభ : అబ్బాయి! ఎలాగో ఒకలాగు సుఖంగా ఉంటే నాకు చాలదూ...రండి ఆచారిగారు, రండి (అని బలవంతంగా ఆచార్యులను తోడ్కొని నిష్క్రమించును.)

రామ : (కొంతసేపు మౌనంగా ఉండి) నిజమేకదా!

మనో : (నిట్టూర్పుతో) నిజమే...అయినా ఎంత అబద్ధం!

రామ : బలే! నిజం, అయినా అబద్ధం. నిజం అబద్ధం - అబద్ధం నిజం. అద్వైత వేదాంత సూత్రంగా ఉంది.

మనో : పరిహాసానికి సమయమా ఇది?

రామ : (కోపంతో) కాదు, కాదు ... పరిహాసానికి సహా నిజం అబద్ధం కాదు.

మనో : నిజమన్నాను. అనగా మీకు తెలిసిన సంగతులు నిజమే అని. అయినా వాటికి మీరు చేసుకొన్న అర్థం తప్పు. మీ ఊహాలన్నీ విపరీతాలు - అందుచేత నే అబద్ధమన్నాను—

రాము : చాల్చాలు! నీ చమత్కారం మాటల్లోనని ఎరుగుదును... నీ మాటలతో మనుష్యుల్ని ప్రపంచాన్నీ మాయం చేసేయగల శక్తి నీకు ఉందని తెలుసు... ఆ శక్తి ఇప్పుడు నీ కేమీ ఉపకరించదు...

మనో : మాటలతో కోటలు కట్టుకొని ఎన్నాళ్ళు రాజ్యం చేయగలను లెండి ... నావధానంగా వినగలిగితే వినండి యదార్థం. సర్వం చెప్పుతాను.

రాము : ఊఁ.

మనో : కొన్నాళ్ళకు ముందు మనం ఇక్కడే మాటాడుకుంటున్నప్పుడు ఒక కుర్రవాడు ఉత్తరం పట్టుకొని వచ్చాడు– నా కోసరం – జ్ఞాపకం తెచ్చుకోండి – ఎవరు వ్రాసిందా ఉత్తరం అని అడిగారు మీరు – ఆ ప్రశ్నకు బదులుగా నేను అబద్ధమాడాను, నిర్మల దగ్గరనుంచి అని. కాదు, ఆ ఉత్తరం ఆచార్యులు వ్రాసినది. చాలా దీనంగా కష్టదశలో ఉన్నానని వ్రాశాడు – రోగస్థుడుగా ఉన్నట్టుకూడా ... సహాయం చేయమని వేడుకొన్నాడు... ఇంతపెద్ద కాలానికి వచ్చి దురవస్థలో ఉన్నాడుకదా అని జాలివేసి – సహాయానికి పంపడానికి చేతులో ఏమీ లేకపోవడంచేత ఆ ఉంగరం ప్రస్తుతం ఉపయోగించుకోవడం లేదుకదా అని పంపాను. పంపుతూ 'ఇంక నా జోలికి రావద్ద'ని కూడ వ్రాశాను. అంతే, ఆ విషయమే మరచిపోయాను. మళ్ళీ కొన్నిరోజులకి మరొక జాబు.

సహాయం చేయమని ప్రార్థన - నేను ఊరుకున్నాను. హఠాత్తుగా ఇవ్వేళ అతనే వచ్చాడు. నోటికి వచ్చింది మాట్లాడాడు - వేడుకొన్నాడు. బెదిరించాడు, ఎత్తి పొడిచాడు, శపించాడు ఊహూ... తుదకు దెబ్బలాట వరకూ వచ్చింది ... ఇంతలో మీరే వచ్చారు. యథార్థం ఇది ... ఇప్పుడు గ్రహించారా ఎందు కన్నానో - నిజమైనా అబద్ధ మని.

రామ : సహాయానికి ధర్మార్థంగా ఉంగరం పంపవలసి వచ్చిందా ? — ఒక్కమాట నన్నడిగితే నే నివ్వలేక పోయానా _ అంత కర్కశహృదయుణ్ణా - పిల్లికి బిచ్చం పెట్టని పిసినిగొట్టునా—

మనో : అందుకని కాదు... నా పూర్వగాథ ఏ విధంగాకూడా మీ శాంతికి భంగం కలిగించకూడదని మీ చెవిని బెట్టలేదు. నా దౌర్భాగ్యం వల్ల తుదకు ఇలా పరిణమించింది. కొంచెం శాంతించి ఆలోచించారంటే మీకు స్పష్టంగా బోధపడుతుంది. అనుమానపు దృష్టితో చూస్తే అరుంధతి నడవడిక కూడా అసందర్భంగానే ఉంటుంది.

రామ : అదుగో అప్పుడే మాటలతో మచ్చుమందు చల్లేస్తున్నావు. ఇంతవరకు నన్ను పిచ్చివెధవను చేసింది చాలక ఇంకానా ... వద్దు ... వద్దు ...

మనో : అబ్బబ్బ ! ఎంత విరసంగా మాట్లాడుతున్నారు. నేను మాట్లాడనులెండి.

రామ : నీవు మాట్లాడితే ఏం... లేకపోతే ఏం. పో. వెళ్ళిపో.

మనో : ఆహా! తప్పకుండా... తక్షణమే మీ యాజ్ఞ అతిక్రమిస్తానా ?అయితే ఒకటే మనవి. నా యీ కడపటి నమస్కారం గ్రహించండి. (నమస్కరిస్తూ)... నా సర్వస్వమూ మీదే... మీ ఋణము ఈ జన్మలో తీర్చుకోలేను. మీరు నన్ను మొట్టమొదట చూచినప్పుడు నిరాధారనై ప్రేమగల వస్తువు ఒక్కటిన్నీ, లేక ఉన్నదానను. ఆస్థితిలో మీరు నాపై కరుణించారు. నన్ను ఆదరించారు; సౌఖ్య మిచ్చారు. సౌభాగ్యవతిని చేశారు; ... బహుశా కొంత ప్రేమ సైతము ఇచ్చారేమో! ... నేనా? నా కున్నదంతయు పూర్తిగా అర్పించుకున్నాను; నా దేహం, నా హృదయం, నా ఆత్మ, మనఃపూర్వకంగా ఆమూచితంగా అర్పించుకొన్నాను. ఆ అర్పణవల్లనే అనిర్వచనీయమైన ఆనందం అనుభవించాను. నా పూర్వజన్మ పరిపాకం... ఇక నా మంచిరోజులు వెళ్ళిపోయినవి. నేనూ వెళ్ళిపోతాను. (కండ్లనీరు ధారలగా ప్రవహిస్తూ వున్నది.) ఎప్పుడైనా నన్ను తలుచుకుంటారో లేదో... తలుచుకుంటే మాత్రం మనం సంతోషంగా గడిపిన రోజులు క్షణాలు, ... ప్రపంచమంతా లీనమైపోయినట్లు కనిపించేదే అట్టి క్షణాలు తలుచుకోండి. ఆశీర్వదించండి. (పాదములంటి నమస్కరించును.

సెలవు (కన్నీరు తుడుచుకొని రెప్పవాల్చక కొంత సేపు చూచి, చటుక్కున తిరిగి నిష్క్రమించును.)

రామ: (ఆందోళన నిజంగా హృదయాన్ని అల్లకల్లోలము చేస్తూ ఉండినా, లేనివిధంగా నటించడానికి ప్రయత్నిస్తూ) ఎంతరాత్రి అయింది...(దీపం పెద్దచేసి పత్రిక చదువుతూ) తిరువాన్కూరులో గొప్ప తుపాను...కలకత్తాలో సమ్మెకట్టు...ఆత్మహత్య, లక్నోలో హిందూ యువతి వింత మరణము... (పత్రిక పారవైచి) నిజంగా...ఆఁ ఉండదు. లేచి వీరయ్యా! వీరయ్యా!

వీర : (ప్రవేశించును) చిత్తం.

రామ: అమ్మగారు ఏమిచేస్తున్నారో చూచిరా... శేషి నడుగు.

వీర : (నిష్క్రమించును.)

రామ: చాలా జాలిగా మాట్లాడిందిగాని నిజంగా చేస్తుందా? నిజంగా చేస్తుందా... ఊహూఁ... చెయ్యదు... ఎందుకు చేస్తుంది... చెయ్యదు.

వీర : (ప్రవేశించి) అమ్మగా రెక్కడా కనపడ్డంలేదండీ.

రామ: ఆఁ, ఆఁ...ఏమీ! ... చెప్పినంతపని చేసిందా. (ఉత్తరీయం వేసుకుంటూ తొందరగా నిష్క్రమించును)

( తెర )

# దేవాలయములో గర్భగృహము

రాత్రి ప్రమిదలలో మినుకు మినుకుమని దీపాలు వెలుగుతూ ఉన్నవి. ఆచార్యులు చిరాకుగా కూర్చున్నాడు క్రింద స్తంభానికి చేరగిలి ప్రవేశము ముసలి కాపుని, చేత కొబ్బరికాయ, పువ్వులు, ఇత్యాదులతో, చీకట్లో చూపుబాగా ఆనక.

కాపు: అయ్యో! పూజారయ్య వెళ్ళిపోయాడా అప్పుడే, ఎలాగ? ఎలాగ?

ఆచా: (చప్పుడు విని) ఎవరక్కడ?

కాపు: అయ్యా! ఉన్నావా? పూజారయ్య నీవేనా.

ఆచా: (విసుగుతో) అవును. అయితే నేం.

కాపు: అయ్యా! వేణుగోపాల మూర్తికి కొబ్బరకాయ కొట్టుకుంటానని మొక్కుకున్నా, మా అబ్బాయికి ఖాయిలా నయమైతే...అది పట్టుకొచ్చాను, కాస్త సమర్పించి ఇంత తులసీ, తీర్థమూ ఇప్పించునాయనా ...వెళ్ళిపోతా ... ఊరుబైటికి వెళ్ళాలి చాలా దూరం.

ఆచా: వెధవ కొబ్బరికాయ కొట్టడానికి వేళే దొరకలే... లేచి దక్షిణ పట్టుకొచ్చావా?

కాపు: దక్షిణా, బాబూ! బిచ్చపుదాన్ని, దగ్గిర డబ్బులుంటాయా...ఉన్న కాణిపెట్టి ఈ పువ్వులూ పండూ కొన్నా, కావలిస్తే ఈ కొబ్బరికాయ తీసుకో కొట్టాకా.

ఆచా: ఛీ! ఎవడికి కావాలి...దక్షిణ లేకపోతే కొబ్బరి కాయ కొట్టడానికి వీల్లేదు... వెళ్ళిపో...

కాపు: బాబూ! నాయనా! కాళ్ళు పట్టుకుంటూ కొంచెం కటాక్షించు. నా మొక్కు చెల్లించు.

ఆచా: వీల్లేదు.

కాపు: అయ్యో! వేణుగోపాల మూర్తి వద్దంటాడా దక్షిణ లేకపోతే.

ఆచా. అధిక ప్రసంగం. వెళ్ళిపో—అర్ధరాత్రి వచ్చి, ఉత్త చేతులతో నన్ను చంపుకు తింటున్నావు.

కాపు: కోప్పడకు...నీకు కనికారం కలిగేదాకా ఇక్కడే కూర్చుంటా... (కూర్చోబోవును.)

ఆచా! పోతావా లేదా! గెంటేస్తా.

కాపు: (తడబడుతూ) వద్దు, తండ్రీ, వద్దు. నేనే వెళ్ళిపోతా (పోవుచూ) ఇందుకే అంటారుగామాలు, దేవుడు వర మిచ్చినా పూజారి వరమియ్యడని (నిష్క్రమించును)

ఆచా: వెధవముండ కెంత నోరు ... (దూరంగా కొబ్బరి కాయ కొట్టిన చప్పుడు విని) వీధిలో కొట్టేసి వెళ్లుతూ ఉంది, దీని పెంకితనము...

ప్రవేశము: గవరయ్య, పూజారి శిష్యుడు

గవ: ఇవ్వనంటే ఇవ్వనన్నాడండీ ఆచార్యులుగారూ! ఏవో మంచిమాటలు చెప్పి తెచ్చాను. రేపట్లోపల

అప్పు తీర్చకపోతే దేవాలయానికే వచ్చి అంద రెదుటా పరువు తీస్తాడట.

ఆచా : అఁ, ఆఁ. పింజారి ... గుండా, చెరువా ?... ఏదీ, ఏదీ అమృతం సేవిస్తేనేగాని అసురత్వం సిద్ధించదు.

గవ : ఇస్తానుగాని, మరేనండి, మొన్న మీటింగులో గూడా చెప్పారు. ఈ అలవాటు చెడ్డది కదండీ. అందులో దేవాలయంలో ...

ఆచా : (నవ్వుతూ) వెధవలు వాళ్ళకేం తెలుసు - ఇది వైదిక సాంప్రదాయంరా. ఋషులు సోమపానం చేసేవారని వినలే... ఆ యుగంలో సోమపానం ఈ యుగంలో ఇలా మారింది.

గవ : (నవ్వుచు) అయితే ఆచార్యులవారు నాకు కూడా కొంచెం దయచేస్తారా.

ఆచా : బలే శిష్యుడవురా ... తే, తే, ఆలస్యం చెయ్యకు. వెళ్ళి పడుకో.

గవ : (లోపల దాచి ఉంచిన సీసా చేతికిచ్చి) సోమపానం చేస్తే నేనూ మీ అంతవాడిని అవుతానా ?

ఆచా: (సీసా తీసుకొని) తప్పకుండా. వెళ్ళిపడుకో, ఆ వైపుగా ... (గవరయ్య నిష్క్రమణం) (కొంచెం తాగి) ఎన్ని బాధలున్నా కనబడవుగదా... ఎంత హుషారు, ఎంత ఉత్సాహం (త్రాగుతూ ఉంటాడు. కైపు మెల్లిగా తల కెక్కుతుంది) ఆఁ...మజా...

మా వేణుగోపాల మూర్తికి మంచి ఉత్సవం చేయించాలి. కళ్యాణోత్సవం... చందా పోగుచేస్తే సరి—

(ప్రవేశం మనోరమ, చీకట్లో ఆచార్యులు చూడడు. కొంచెంసేపు వరకు) ఎవరు? ఎవరు? నవ్వుచు (చంకలు తట్టుచూ) రుక్మిణీదేవి, మా రుక్మిణీదేవి (నమస్కారం చేస్తూ) మా అమ్మ! ప్రత్యక్షమయ్యావా? (లేవబోయి తడబడి, మళ్ళీ కూర్చుని) అపరాధం: మన్నించాలి, నా తల్లివిగదూ...

మనో: ఓహో! ఆచార్యులవారికి కైపులో చూపూ మతీ రెండు మబ్బు కమ్మింది కాబోలు.

ఆచా: (ధ్వని ఆనవాలుపట్టి, తేరిచూచి) ఆ ఆ నీవేనా! మనూ! నీవేనా ఈ రాత్రి ఇక్కడికి! నీవేనా?

మనో: నేనే...

ప్రవేశము రామమూర్తి. ఇద్దరి సంభాషణ
వింటూ స్తంభంచాటున నిలుచున్నాడు.

ఆచా: (వికటంగా నవ్వుచు) అయ్యయ్యో! ఎంత దూరం వచ్చావు... కాకితో కబురంపితే వచ్చేవాడినే ... (యోచించినట్లు నటించి) కాదు కాదు,... ఆ కుర్రవానిని పడుకోబెట్టి నా దగ్గరకు వచ్చావు కదూ ... శహబాష్...

మనో: ఛీ!

ఆచా : ఛీ! భళీ! నేను నచ్చలేదుకహూ ... అయితే ఎందుకు వచ్చావు ... ఓహో! కఠినంగా పట్టి చేతులతో పంపేశానని జాలిపుట్టి వచ్చావా?

మనో : నీపైనా జాలి ... దేహమంతా కుళ్ళి, పురుగులుపడి, దుర్గంధముతో దుమ్ములోపడి దొర్లుతూ వున్నా నిన్నుచూచి నేను జాలిపడతానా ... నాహృదయం రాయి ... కఠిన పాషాణం అయిపోయింది ... ఎందుకు వచ్చానా? ... ఎక్కడినుంచి వెళ్ళినానో అక్కడికే వచ్చాను. పిల్లవాడు ఎగరవేస్తే బంతి ఏమనుకొం టుంది. పైకి పోతూ ఉన్నప్పుడు ప నక్షత్ర మండ లానికో వెళ్ళుతున్నా ననుకొంటుంది. ఆఖరికి భూమి మీదే పడుతుంది. అలాగే నేనూ—పడ్డాను. నక్షత్ర మండలంలోనే నిలుపటానికి ఏ విశ్వామిత్రుడు లేడు గావున ... మీరు పుణ్యం గట్టుకొన్నారు ... మొదట నోరెరగని చిన్నపిల్లగా ఉన్నప్పుడు ఈ వృత్తిలోకి తీసుకొని వచ్చిన పుణ్యాత్ములు మీరే: ఈ కూప ములో నుంచి బయటపడి స్వర్గీయ సుఖం అనుభ విస్తూ ఉంటే నా జీవితాన్ని బ్రద్దలుచేసింది మీరే! ... నా ఉసురు ఊరికేపోదు ... నేను మీ ప్రక్కనే ఉండి మీ రనుభవించబోయే ఘోర శిక్ష లన్నీ చూచి ఆనందించను వచ్చాను. ... ఏమో ఆఖరికి మీ పాలిటి మృత్యుదేవతను కూడా నేనే అవుతా నేమో! ... అవును ఈ దైవం మీబోటి వాళ్ళని శిక్షింపడు. నేనే శిక్షిస్తా.

ఆచా : ఝోరుగా మాట్లాడుతున్నావు... ఏం! తరిమివేశాడేమో వచ్చేశావు ... బాగానే ఉంది ... పోనీ! ఏమైనా పట్టుకొనైనా వచ్చావా, నగా నట్రా, (సన్నని వెలుతుర్లో ఎగా దిగా చూస్తాడు. ఏ నగా కనబడదు.) ఇదేమిటి బిచ్చపు వేషము. అన్నీ తీసుకొని తరిమాడా? లేక దాచేసుకున్నావా?

మనో : ఛీ! అందరు నీవలె నీచులే అనుకొన్నావా? వారికే క్షణంలో, సకారణంగానో, అకారణంగానో నామీద నమ్మకం తప్పిందో - ఆ క్షణమే వారి చెంతనుండి, వారికి బాధ కలుగజేయడం తప్పని, నేనే వచ్చేశాను. వారికి తెలియదుకూడా ... నేను ధరించుకొన్న ఆభరణాలన్నీ వారివి, వారి ప్రేమ అభిమానం - వాటి చిహ్నాలు- అవే గతించినప్పుడు చిహ్నాలు నా కేందుకు? ధరించడానికి అర్హతకూడా లేదు, అన్నీ వదిలివేసే వచ్చేశాను.

ఆచా : ఓసి పతివ్రత!

మనో : హుఁ. పతివ్రత అన్న పదము మీకు తిట్టుగా ఉంది కాబోలు... ఆ సంబోధన నాకు ఆశీర్వాదమేలెండి.

ఆచా : ఉండు. ఉండు. నీ వొంటిమీద బంగారు ముక్కే లేదూ... అబద్ధం. మెళ్ళో ఏదో మెరుస్తూ ఉంటే.

మనో : ఆఁ, ఆఁ. అది పవిత్రమైనది... నా దేహము, నా ఆత్మ అన్నీ వారికి సమర్పించుకొన్నదానికి లాంఛనం - అది నగ కాదు. మంగళసూత్రం...

ఆచా: (విరగబడి నవ్వుచు) ఓహో! ఓహో! కలియుగంలో దాసీముండలకు మంగళసూత్రం కూడానా? ... చాల్చాలు ... నాటకం ఆడుతూ ఉన్నావు. త్వరగా తీసిచ్చేసి వెళ్ళి పడుకో ... మంచి సమయానికి వచ్చావు. సారాకొట్టువాడు చంపేస్తున్నాడు. బాకీ నిమిత్తం సొమ్ము ఇవ్వలేదని - ఏదో తత్కాలానికి ఉపయోగిస్తుంది - మంచి బంగారమేనా.

మనో: మీ కర్థమవడం లేదు కైపు మూలాన ... దాన్ని ముట్టడానికి కూడా వీల్లేదు ఎవరికీ - నా జీవితం ఉండేవరకు.

ఆచా: అహా... అంత పొగరా? (లేచి దగ్గరకు రాబోవుచు తూలుచు.)

మనో: ఆగండి. ఆగండి.

ఆచా: ఆగడం లేదు గీగడం లేదు. (పైబడి మంగళసూత్రం పట్టుకోబోవును.)

మనో: (త్రోసివేయుటకు ప్రయత్నించి, వీలుగాక, వెర్రిగా ఏమీ తోచక ప్రక్కనున్న ఇత్తడిచెంబు తీసుకొని తలపై గట్టిగా మోదును. ఆచార్యులు 'అమ్మో' అని కేకవేసి క్రిందపడును. రక్తము చెవిమీదనుండి ధారగా ప్రవహిస్తున్నది. ఆచార్యులు మూర్ఛబోయాడు. దిగ్భ్రమ చెంది చూస్తూ ఉన్నది. వస్త్రములో రక్తబిందువులు పడినవి చూచుకోలేదు...)

రామ: (జరిగినదిచూచి ముందుకువచ్చి మనోరమ చెయ్యి పట్టుకుని) భయపడకు నేనున్నాను.

(ప్రవేశము : గవరయ్య కేకలువిని అప్పుడే మేల్కొని-

గవ : (మూర్ఛపోయిన ఆచార్యుల్ని రక్తాన్ని చూచి) అమ్మో! చంపేశారు! ఖూనీ! పోలీసువాళ్ళు. (అని వెర్రిగా కేకలువేస్తూ నిష్క్రమించును.)

మనో: వెళ్ళిపొండి కుర్రవాడు పోలీసువాళ్లను తీసుకొనివస్తాడు.

రామ: (తలఊపుచు) వెళ్ళను నీతోనే ఉంటాను.

మనో: ఎందుకని ?

రామ: నిన్ను విడిచి నేను ఉండలేను గనుక.

మనో: (అపహాసించి) చెడ్డలేకుండా మంచి ఉండజాలదా ?

రామ: కాదు, కాదు. మనూ! నన్ను క్షమించు. నీయందు చేసిన అపరాధానికి ఏ శిక్ష అయినా విధించు.

మనో: అయ్యయ్యో ! నేనా ... లేదు, లేదు. మీరు దయాపూర్వులగుటచేత ఇలా చేస్తున్నారు. ఒంటరిగా నే నేమైపోతానో ఈ సమయాన అని లేదు. నాకేమీ భయంలేదు ... ... నాకెందుకూ భయం? ... ఇంక ?

రామ: కాదు, అదికాదు కారణము ... నీపై ప్రేమయే కారణము.

మనో: నా పైనా (నవ్వి) చూచారా ! ఈ చేతులు చాలా అందంగా ఉన్నాయి.

రామ: ఆహా చూచాను ... యజ్ఞం చేసివచ్చిన సోమయాజి వలె నున్నావు ...

మనో: (సంతోషాతి చయముచేత పలకదు కొంతసేపు ఊరకుండి) అయ్యో! ఏమైనా చేతామురండి ... (ప్రక్కనున్న నీళ్ల చెంబుతో ఆచార్యుల ముఖముపై చల్లుతుంది. రామ సహాయంచేస్తూ ఉంటాడు.)

ప్రవేశము పోలీసు వాళ్ళతో గవరయ్య.

గవ : అదుగో! అదుగోనండి—వారిద్దరూ చేరి మా ఆచార్యుల్ని ఖూనీ చేసేశారండి. (ఏడుస్తాడు)

1 పో: అయ్యా! ఏమిజరిగిందో చెప్పగలరా?

2 పో: మనిషి చచ్చాడా బ్రతికున్నాడా ...

రామ: బ్రతికున్నట్లే ఉన్నది. రక్తం నిలిచిపోయింది.

1 పో: జరిగిందంతా ఉన్నదున్నట్టు చెప్పాలి...

రామ: నేనేమీ చెప్పదలచుకోలేదు.

2 పో: (మనుతో) ఏం నీవు.

రామ: ఆవిడకూడా ఏమీ చెప్పరు... మీరేమి చెయ్యాలో చెయ్యండి.

1 పో: ఇంకేమి చెయ్యడం ... ... ఇద్దర్నీ అరెస్టుచేస్తూ ఉన్నాము ... డబేదార్! ఈలవెయ్యి. డాక్టర్‌కి కబురుచెయ్యి ...

2 పో (ఈలవేయును)

పోలీసువాళ్ళు ఇరుప్రక్కల నిలుచుందురు. మనోరమ రామమూర్తి ఒకరి నొకరు చూచుకుంటూ నిలుచున్నారు – సంతోషంతో –

( తెర )

•

## రంగము - 3

రామారావుగారింట్లో గది.

వస్తువులన్నీ తారుమారుగా ఉన్నవి. మనోరమ సర్దుతూ ఉన్నది. మూలనున్న తంబురా తీసి మీటుతుంది. అంతా అపస్వరం. క్రింద కూర్చుండి శృతి సరిచేస్తుంది. చేసి మీటుతూ పాడుతుంది....... రెండు అడుగులు పాడి ఆపివేసి మళ్ళీ యథాస్థానే తంబురా పెట్టి ఒక కుర్చీమీద కూర్చుంటుంది—ఏకో ఆలోచిస్తూ ...........

ప్రవేశం రామారావు.

రామా: (ఉత్తరీయం తీసి కుర్చీపైకి ఇసిరి, ఉస్సురుమని) అబ్బ, ముగిసింది ఈ నాటకం. (మనోరమను చూచి) ఏమి మనూ! — చింతాక్రాంతంగా వున్నావు. నాటకం అయిపోయిందని విచారంగా వుందా?

మనో: మన విషయానికి కాదు. పాపం నా మూలాన్ని నా సాక్ష్యంమీద ఆచార్లుకు శిక్షపడ్డదికదా అని.

రామా: నీవంటి చిత్రమైన వ్యక్తి ఎక్కడా ఉండదు. వాడి మీద నీకింకా జాలికూడానా.

మనో: ఎవ్వరైనా సరేనండి కష్టపడుతూవుంటే నాకు జాలి వేస్తుందండి. అది నా స్వభావం ఏమో! ఆయన స్థానంలో మీరూ నేనూ వుంటే ఏమి చేసి వుండే వాళ్ళమో? మంచివాళ్ళకీ చెడ్డవాళ్ళకీ భేదం చాలాస్వల్పం. నన్ను ఒకప్పుడు చెడ్డదాన్నని మీరు అనుకో లేదూ,

రామా: ఆ పాపచింతకు తగినశిక్ష అనుభవించ లేదా మరి... ఆ రోజులు తలుచుకుంటే భయం వేస్తుంది. నిన్ను పూర్తిగా పోగొట్టుకోబోతినికదా.

మనో: అలా జరగంది నా అదృష్టం. ప్రపంచంలో అన్ని విషాద కథలూ ఈ విధంగానే సంతోషంగా పరిణమిస్తవా ?

శోభ : అబ్బాయి ! అమ్మాయి ! (ఇద్దరు నమస్కరిస్తారు.) దీర్ఘాయుష్మాన్ భవ ! దీర్ఘ సుమంగళీ భవ — కష్టాలన్నీ వెనకబడ్డాయి. అమ్మా, ఎంత పొరబాటు చేశాను నీ విషయంలో... కోర్టులో నీకథ నీవు జడ్జిగారికి చెపుతూవుంటే, కుర్రరాడిలాగా వడిచేశాను. కండ్లు తడిగానివాడు ఒక్కడున్నాడా. అక్కడ పోలీసు వాళ్ళలోసహా... గవర్నమెంటు వకీలే కేసు కొట్టేయమని చెప్పేస్థితికి వచ్చాడు కదమ్మా...... అబ్బాయి, నేను ఎప్పుడో అన్నమాటలు మరిచి పోతావుగదూ—

రామ: మరచిపోయాను... మనోరమ అప్పుడైనా మీామీాద ఒక్కమాట పడనిచ్చేదికాదు.

శోభ : ఇల్లాలవు తల్లీ—

మనో: మజ్జిగ కొంచెం పుచ్చుకుంటారా ?

శోభ : నేనే వచ్చి భోజనమే చేస్తాను లేవమ్మా ... ఇప్పుడు ఒక విశేషం చెప్పడానికి వచ్చాను. మా అమ్మాయి శుభ్రదకు మంచి సంబంధం కుదిరింది. పై శుక్ర వారమే ముహూర్తం. మీ రిద్దరూ తప్పకుండా రావాలి, వచ్చి వధూవరులను ఆశీర్వదించాలి. మీ యిద్దరికి యెంత అన్యోన్య ప్రేమ. అభిమానం ఉందో ఆ విధంగానే వారికి ఉండవలెనని- వస్తారు గదూ___

రామ: తప్పకుండా.

మనో: సంతోషంతో.___

శోభ: ఇక వెళ్తాను... వెళ్ళుతూ తనలో ఏ వెధవ ఆక్షే పిస్తాడో చూస్తాను! (నిష్క్రమణ)

రామ: (వెళ్ళిపోయిన కొంతసేపటికి నవ్వుచు) మామయ్య ఎలా మారిపోయాడో? నీ యింద్రజాలంలో పడిపో యాడు.

మనో: మీరూను అంతేగా బోలు.

రామ: క్షమించు మనూ, మామయ్య ఇలా తలస్తిండు లవు తాడని అనుకో లేదు.

మనో: ఆయన చెడ్డవారు కారండీ ... మీ మీద నిజంగా ప్రేమ గలవారు ...ఎంతో ఔదార్యం ఉంటేగాని తప్పు చేశానని ఒప్పుకోరండి.

రామ: నిజమే...(విని) ఇంకెవరో వస్తున్నారు. పత్రికా విలేఖరులు కారుగద.

ప్రవేశం : సుబ్బారావు, నిరుపమ.

రామ: } రా, రా, సుబ్బారావు.
మనో: } రా, నిరూ, రా.

రామ: ఇద్దరూ ఇక్కడ కలిశారా?

సుబ్బా: నవ్వుచు లేదు. లేదు...కలిసే వచ్చాము.

రామ: నవ్వేందుకోయి.

సుబ్బ: చెప్పు నిరూ. నీవే చెప్పు.

నిరుపమ: (సిగ్గుతో) మీరే చెప్పండి.

మనో: (ఊహించి) నాకు అర్థమవుతూ ఉందడోయి...ఏ...
వినబడ్డంలేదూ, సన్నాయి, బాజా బజంత్రీలు.

రామ: (ఇప్పుడు స్ఫురించి) నిజంగా?

సుబ్బా: నిజంగానే ... సత్కార్యములు సర్వదా అనుసర
ణీయములు అన్న బుధోక్తి మాకు దారి జూపింది...
రామూ...ఇది హఠాత్తుగా ఉద్భవించింది కాదురా!
...అయితే ఇంతవరకు ధైర్యం చాలకపోయింది.

మనో: నిరూ! మౌనంగానే ఎంత పని సాధించావు!

సుబ్బా: అనేక అరేంజిమెంట్లు చెయ్యాలరా. ఇక మాకు
సెలవిప్పించండి. మీ రిద్దరూ వివాహ మహోత్స
వానికి విచ్చేసి, వధూవరులను ఆశీర్వదించమని
మా ప్రార్థన.

నిరుపమ: అవును - మనూ ... మా ప్రార్థన.

రామ : (తెచ్చుకున్న గాంభీర్యంతో) (మనోరమతో) ఏమి దేవీ ? భక్తుల ఈప్సిత వరమును అనుగ్రహించుట నీ కిష్టమేగదా !

మనో: ఆ విధంగానే మీరు వక్కాణించినట్లే అగుగాక !
(అందరూ నవ్వులు.)

సుబ్బా: } సెలవు (నిష్క్రమణ)
నిరు: }

రామ: ఏం ! మనూ ! పెద్ద ముత్తైదువ అయిపోతున్నావు !

బొట్టు పెద్దది చెయ్యి.

మనో: పోదురూ ... రాండి, ఆకలవుతోంది.

(ఇద్దరు నిష్క్రమిస్తారు.)

---